ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీ మద్రామడుగు శివరామదీక్షిత అచల పరిపూర్ణ సిద్ధాంతము

# అచల బోధ అంతర్గామి

శ్రీ విజయ నామ సంవత్సరం 2013-14







శ్రీ భాగవతుల

శ్రీ కృష్ణదేశిక ప్రభువుల వారు



గ్రంథ రచన

శ్రీ సద్గురు కటాక్ష విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు

1-4-27/71/29, పద్మశాలి కాలనీ, హైదరాబాద్-500 080

శ్రీ దయానంద స్వాముల రాజయోగీంద్రుల వారి ప్రియశిష్యులు



శ్రీ వివేకానంద అగోలు సంగయాఖ్య రాజయోగి

శ్రీ వివేకానంద అగోలు సంగయాఖ్య రాజయోగి గారి ప్రియశిష్యులు



సద్గురు కటాక్ష శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు

వీరు శ్రీ వివేకానంద అగేలు సంగయాఖ్యుల వారి ప్రియశిష్యులు సద్గురు కటాక్ష శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు. వీరి జన్మ స్థానము వీరారెడ్డిపల్లి, తుర్కపల్లి మండలం, నల్గొండ జిల్లా. వీరికి వివాహము 1973 సంవత్సరంలో క్షీరసాగరం, మెదక్ జిల్లాలో జరిగింది. ఈ క్షీరసాగరంలోనే 1995లో బ్రహ్మోపదేశం ఉపదేశించబడినది. 15-5-2003లో శ్రీ విజయానంద అను దీక్షిత నామము పొందినారు. అప్పటినుండి ఇప్పటివరకు నిరవధికంగా అచల ఋషి క్యాలండర్ - యదార్థ బోధ - అచలబోధ అంతర్యామి అను పాఠ్య విధానముతో ఆంధ్ర రాష్ట్రము, మహారాష్ట్ర, కర్నాటకలో అందజేయడం జరిగింది. దీని ఉద్దేశ్యం కూడా విజయవంతం కావచ్చింది. సులభశ్రేణిలో బోధ యొక్క మర్మధర్మాలు అన్నీ అనేకముగా తెలియ జేయుచున్నారు. గ్రామాలు, పట్టణాలు అన్నీ కలిసి సుమారు 80 గురుపూజా స్థలాలలో పర్యటించారు.

సద్గురు కటాక్ష శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు
1-4-27/71/29, పద్మశాలికాలనీ,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 080.
ఫోన్: 9849560048, 040-27537839



శ్రీమతి రాజశ్రీ సమేత శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు



## శ్రీ బోధానంద రాపెల్లి రాంచెందయ్య రాజయోగి

### బచ్చన్నపేట ఉపపీఠ కార్యదర్శి

శ్రీ బోధానంద రాపెల్లి రాంచంద్రయ్య రాజయోగి మరియు శ్రీ సదానంద తంగెళ్లపల్లి శ్రీహరి రాజయోగి గార్లు శ్రీ వివేకానంద అగేలు సంగయాఖ్య రాజయోగీంద్రుల వారి ప్రియశిష్యులు. శ్రీ వివేకానంద అగేలు సంగయాఖ్య రాజయోగి బచ్చన్నపేటలో స్థిరపడుటకు వీరే కారణము. వీరు ఇరువురు ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగి పదవీ విరమణ చేసినారు. వీరు సుమారు 40 సంవత్సరాల నుండి శ్రీ వివేకానంద అగేలు సంగయాఖ్య రాజయోగి వద్ద శిక్షణ పొంది అధికారపత్రం అందుకున్నారు. శ్రీ దయానంద రాజయోగీంద్రుల కాళలో ముఖ్యమైనవారిలో వీరు కూడాను.

శ్రీ బోధానంద రామచంద్ర రాజయోగి, వీరి సతీమణి శ్రీమతి సద్గుణానంద శకుంతల. ఈమె అశరీరులు అయినారు. శ్రీ బోధానంద రామచంద్రయ్య వివేకానంద అగేలు సంగయాఖ్యులవారి పీఠంలో ఆశీనులై కార్యదర్శిగా కొనసాగుతున్నారు.



## శ్రీ ప్రేమాంబ ప్రేమలత సమేత
## శ్రీ సదానంద తంగెళ్లపదల్లి శ్రీహరి రాజయోగి

జనగాంలో స్వతహాగా ఏర్పాటుచేసుకున్న ఆశ్రమానికి అధిపతి శ్రీ సదానంద శ్రీహరి రాజయోగి ప్రేమాంబ ప్రేమలత రాజయోగిని - వీరిరువురు ఉపాధ్యాయులుగా పనిచేసి పదవీ విరమణ చేసియున్నారు. వీరికి గురుసేవా, గురు భక్తి, గురు నిష్ఠ చెడకుండా అన్నట్లుగా సాంప్రదాయ ప్రచారమే ధ్యేయముగా చేసుకుని రాష్ట్రంలో పలుచోట్ల పర్యటనలు చేస్తూ శిష్య జనాన్ని పెంచుకుంటున్నారు. అనగా, ఒక విధంగా గురు ఋణము తీర్చుకుంటున్నారని భావన.

**శ్రీ సదానంద శ్రీహరి రాజయోగి**
విద్యానగర్, బానాపురం-506 167, జనగాం పోస్ట్, వరంగల్ జిల్లా.

వీరు శ్రీ వివేకానంద అగేలు సంగయాఖ్యుల వారి ప్రియశిష్యులు

## శ్రీ బ్రహ్మానంద రాపల్లి శ్రీధర స్వామి వీరి ధర్మపత్ని సునిత



వీరి తండ్రిగారు బచ్చన్నపేట ఉప పీఠ కార్యదర్శి అయిన శ్రీ బోధానంద రాపెల్లి రాంచెంద్రయ్య రాజయోగి వీరి తల్లి సద్గుణానంద శకుంతల రాజయోగిని.

వీరు వరంగల్ జిల్లా బచ్చన్నపేట మండలం కేంద్రంలో 26-7-1970న జన్మించినారు. శ్రీ బోధానంద రాపెల్లి రాంచెంద్రయ్య రాజయోగి గారి ప్రథమ కుమారుడు. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో

ఉన్నత విద్య పూర్తిచేసి శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయముపై పిహెచ్‌డి చేసి యున్నారు. జీవిత గమనంలో ఇప్పుడు వీరు అమెరికా దేశము చేరుకున్నారు. ఉద్దేశం గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ కావడంతో అక్కడ తన ఉద్యోగ ధర్మాన్ని పాటించుచు ఇద్దరు పిల్లలు, అర్ధాంగితోపాటు అక్కడ స్థిరపడి శివరామ దీక్షిత సాంప్రదాయంలో అయన శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువుల వలె 3000 కంద పద్యములు వ్రాసి ప్రచురణకు సిద్ధం చేసియున్నారు. అనగా సాంప్రదాయ ఉద్దండులలో వీరొకరు అని తెలియుచున్నది.

౦ి౦ ఓం ౦ి౦

శ్రీ గురుభ్యోనమః

శ్రీకృష్ణ పరమాత్మ పరంపరా గురు విద్య యగు

శ్రీమద్రామడుగు

శ్రీ శివరామ దీక్షిత అచల పరిపూర్ణ సిద్ధాంతము

# అచల బోధ అంతర్గామి

తెలుగు సాంప్రదాయాన్ని తెలుగు సంవత్సరాదిన

**విడుదల**

శ్రీ విజయ నామ సంవత్సర చైత్ర శు॥ పాడ్యమి

గురువారం 11-4-2013

గ్రంథ ప్రత్యేకములు:

**గురు స్వరూపము**

**గురువాక్యోపనిషత్తు - పంచశాంతి మంత్రార్థము**

**పెద్దల వాక్యాలు - తరించుటకు మార్గాలు**

రచన - సేకరణ :

సద్గురు కటాక్ష **శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు**

1-4-27/71/29, పద్మశాలికాలని, హైదరాబాద్-500 080

మద్గురువరేణ్యులు

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి

శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షాతాచల గురూపపీఠం

బచ్చన్నపేట మండలం, జిల్లా వరంగల్ - 506 221.

**వెల రూ.60/-**

దీనితో క్యాలండర్ ఉచితం



7-2-2013, 8-2-2013 రోజులలో

శత వార్షికోత్సవాన్ని అతి ఘనంగా జరిపించుకున్న

# శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణదేశిక ప్రభువుల వారు

శ్లో. గురుబ్రహ్మా గురు విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీ గురువేనమః

శ్లో. శ్రీ వత్సగోత్ర కలశాంబుధి పూర్ణచంద్రం
శ్రీ కృష్ణ పాదకమలమృతపానభృంగం
శ్రీ ఫీల్కాణ వంశాంబుధిం రేవతాజం
శ్రీ లక్ష్మణార్య మనసాస్వగురుం భజామ్యహం

శ్రీమత్ ఫీల్కాన లక్ష్మణ దేశిక ప్రభువుల వారి శతవార్షికారాధన పూజా మహోత్సవాన్ని జరిపించిన చక్రవర్తి శ్రీ సమిష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి స్వామి వారు శతవార్షికోత్సవాన్ని నిర్ణయించుకున్నప్రకారం అనుకున్నది అనుకున్నట్లుగా అతివైభవోపేతంగా జరిపించినారు. భక్తులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. రాష్ట్రంలో పలు ప్రాంతాల నుండి ఇతర రాష్ట్రాల నుండి కూడా అనేకమంది గురువులు వచ్చినారు. శతవార్షికోత్సవంలో పాల్గొన్నారు. ఆ అనుభూతిని పొందినారు.



ప. శ్రీ ఉప్పలంచి రామయార్య జటర జనితం
శ్రీ కొండూజు శీతయార్య చరణ సేవితం
శ్రీ పల్లెలకోటి లింగార్య అనుభవ గ్రోలితం
శ్రీ లలితాంబ సమేత ఉప్పలంచి కృష్ణమూర్తిం భజే.

## శ్రీ సమిష్టి బోదానంద ఉప్పలంచి కృష్ణమూర్తి

లాలాపేట్, సికింద్రాబాద్.

# విజ్ఞప్తి

భక్తులకు సాంప్రదాయ ఉద్దండులకు మా యొక్క విజ్ఞప్తి. అచల ఋషి క్యాలండర్ 2003 సంవత్సరమున ప్రారంభించాము. ఇప్పటికి పదేళ్లు పూర్తికావచ్చినది. ఆనాటి ఈ క్యాలండర్‌ను ప్రవేశపెట్టడంలో ఒక ప్రత్యేకత, ఒక ఉద్దేశం ఉన్నది. అది ఏమిటంటే, సమాజములోని ప్రతి వారికి ప్రతి రోజూ అవసరమైయున్నది. కనుక ప్రతి రోజూ క్యాలండర్‌ను చూస్తారు కదా. అదే విధముగా అచల ఋషి యొక్క బోధను చూచి అవగాహన చేసుకొని క్రమేణా కొత్తవారు ఈ సాంప్రదాయములో చేరుటకు అవకాశము ఉన్నది అని ఆలోచన చేసి ఈ క్యాలండర్‌ను ప్రవేశపెట్టాము. ఆ విధముగానే కొత్తవారి సంఖ్య పెరిగినది. దేశములో ఎక్కడెక్కడ సాంప్రదాయకులు ఉన్నారు -- పూజ కార్యక్రమములు ఏ మాసములో ఎక్కడ జరుగుతాయి -- అన్న విధానము దక్షిణామూర్తి మొదలుకొని సాంప్రదాయ పరంపర గురువుల నందరినీ తెలియజేయడం జరిగినది. భక్తజనులను చాలా ప్రభావితము చేసినది. అంతేకాదు, ఈ సాంప్రదాయ క్యాలండర్‌ను మరికొందరు తయారు చేయుటకు ప్రభావితము చేసినది. 1. శ్రీ దయానంద బాల్‌నాక్ పరమేశ్వర్, కోఠి, 2. శ్రీ పీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువుల మందిరము, సికింద్రాబాద్, 3. ప్రజ్ఞాన విలక్షణ శ్రీ బి. గోపాల్‌బాబు, విశాఖపట్నం -- ఈ సంవత్సరం వంటిమామిడి మందిరము వాళ్లుకూడా వేసినారు. మరియు గురుపథం కాళిదాసు గారు క్యాలండర్‌ను తయారుచేసియున్నారు. ఇంకా అనేక భక్తులను ప్రభావితము చేసియున్నది.

అందువలన వచ్చే సంవత్సరం నుండి ఈ క్యాలండర్‌ను రద్దు చేస్తూ, ఒక అచల బోధ అంతర్గామి అనే గ్రంథమును సాంప్రదాయక పెద్దలు / శ్రీ సమిష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి స్వామి వారు - శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ స్వామి వారు - శ్రీ అచల విద్యా విశారద కంబాల గురుమూర్తి - శ్రీ దయానంద నాగుల వెంకటేశం స్వామివారు మరియు దేశములో ఉన్న సాంపదాయ ఉద్దండుల యొక్క వ్యాసాలు వ్రాస్తూ సాంప్రదాయములో ఉన్న రహస్యాది రహస్యమైన విషయములను అనగా జీవితకాలము ప్రయాస చెందినా దొరకని రహస్యములను మీకు అందజేయాలని తలంచుచున్నాము. ఇందుకు ఆసక్తి కలిగినవారు తమ తమ అభిప్రాయాలను మాకు తెలియజేయగలరని మనవి చేయుచున్నాము.

ఇట్లు,

**శ్రీ సద్గురు కటాక్ష విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు**

1-4-27/71/29, పద్మశాలికాలని, హైదరాబాద్-500 080

9849560048, 040-27537839 - 9849107122

# శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రులు భక్తుల కొరకై వారు వ్రాసిన గ్రంథాలు:

10-3-1899 సంవత్సరం అనగా విలంబి నామ సంవత్సర మాఘ బ॥ త్రయోదశి అనగా మహాశివరాత్రి నాడు సాయంత్రం 5.00 గంటలకు ఆదిగురువగు పరమశివుని అవతారమో అనునట్లు జన్మించిరి. ఐదవ ఏట బడిలో చేరిన వీరు అక్షరాభ్యాసము, గుణితములు, పెద్దబాలశిక్ష, సుమతీ శతకము, కృష్ణ శతకము, నారసింహ శతకము - బాల రామాయణము, భారత మండలి సావిత్రోపాఖ్యానము చదువుకొని, లెక్కల యందు నిపుణుడు అయ్యారు. వీరికి విద్యాభ్యాసము పరిసమాప్తమాయెను. అప్పటికి వీరికి 8 సంవత్సరములు. ఆ కాలంలో అంతకంటే పెద్ద చదువులు చదివేవారు అరుదు. ఫీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువుల శిష్యుడగు మొగడం పల్లి మల్లయ్యగారి సాంగత్యము వలన శ్రీ శివరామ దీక్షితుల వారి సిద్ధాంతమునకు బీజమాయెను. 11 - 12వ ఏట శ్రీ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువులు రచించిన ఖండమాల, అఖండమాల తాత్పర్యములను రాగ - తాళ యుక్తంగా గానము చేయుచుండిరి. వీరి తల్లి మల్లమాంబ - తండ్రి వెంకన్న గారు.

12వ ఏట చెన్నమాంబయను కన్యారత్నముతో వివాహమాయెను. తదుపరి సాంప్రదాయములో అంచలంచెలుగా ఎదిగి 13వ ఏటనే వీరికి శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వామి దర్శనమాయెను. వీరి ప్రియ శిష్యుడు శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి దర్శన భాగ్యము కలిగెను. 22 సంవత్సరముల ప్రాయములో దుర్మతి నామ సంవత్సర వైశాఖ పూర్ణిమ నాడు 21-5-1921 శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి గారు ధర్మోదేశం గావించి దీక్ష నొసంగిరి. బుద్ధ భగవానునికికూడా వైశాఖ పూర్ణిమ నాడు జ్ఞానోదయమాయెను. ఆ పర్వదినముననే పొన్నాల రాజయోగి గారికి పూర్ణబోధ ప్రసాదింపబడుట ఒక ప్రత్యేకత. శ్రీ దయానంద పొన్నాల రాజయ్య గారు బహుళ ప్రచారం చేసి 30 ఉపపీఠములను ఏర్పాటు చేసెను. చెన్నమాంబ దురదృష్టవశాత్తు పక్షవాతముతో మరణించెను. తదనంతరం 9-11-1944లో శ్రీ అనసూయాంబికా అను కన్యా రత్నముతో వివాహమాయెను. ఆ తదుపరి వీరు సాంప్రదాయక గ్రంథములు వ్రాసియుండిరి.

1. అచల పరిపూర్ణ రాజయోగము నిజ ప్రబోధ విధానము.

2. రాజయోగి స్మృతిచంద్రిక
3. తారకామృత పరమహంస ప్రబోధిని.
4. అస్పర్షయోగము శ్రీమత్ భగవద్గీత 18 అధ్యాయములు.
5. అనన్యాచల పరిపూర్ణ ప్రబోధిని.
6. సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని.
7. పరిపూర్ణ రాజ విద్యా రాజగుహ్యా శిఖామణి.
8. పరిపూర్ణ రాజయోగ తత్వ ప్రకాశిక



శ్రీమద్రామడుగు
శ్రీ శివరామ దీక్షితాచల
గురు పీఠాధిపతులు
శ్రీ దయానంద స్వామి
రాజయోగీంద్రులు
పాత బోయిగూడ,
మహంకాళీ స్ట్రీట్,
సికింద్రాబాద్.

9. ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దర్పులు - భద్రాద్రిరామ శతకము - సుజ్ఞాన దీపమను గురు గీతలకు - విశేషార్థము వ్రాసి భక్తులకు సాంప్రదాయక రహస్యములెన్నియో అందజేసియుండిరి.

## శ్రీ మద్రామడుగు శ్రీ శివరామ దీక్షిత గురుపీఠం

4-1-96, మహంకాళి స్ట్రీట్, సికింద్రాబాద్ - 500 003.

---

ఈ అచల ఋషి క్యాలండర్‌ను ప్రారంభించి పది సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా భక్తులకు ప్రకటనలపై రాయితీ ఇవ్వబడును.

## అరపేజీ కొరకు రూ.600/- చెల్లించండి

ఒక సంవత్సరం వారి వారి ఆశ్రమము యొక్క ప్రకటన ప్రచురించబడును.
మరియు ప్రతి సంవత్సరం ఒక కాపీ ఉచితంగా అందించబడును.

## పూర్తి పేజీ కొరకు రూ.1200/- చెల్లించండి

ఒక సంవత్సరం వారి వారి ఆశ్రమము యొక్క ప్రకటన ప్రచురించబడును.
మరియు ప్రతి సంవత్సరం ఒక కాపీ ఉచితంగా అందించబడును.

**ఆసక్తి గలవారు వెంటనే మా చిరునామాకు తెలియజేసి పేరును నమోదు చేయించుకోగలరు.**

### శ్రీ సద్గురు కటాక్ష విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు

1-4-27/71/29, పద్మశాలికాలని, హైదరాబాద్-500 080

9849560048, 040-27537839 - 9849107122



# శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్యుల వారి 107 సంవత్సరముల జీవనయానము వీరు భక్తులకు అందజేసిన సాంప్రదాయక ప్రత్యేకతలు

కం. అచ్చమాంబ ఆగోలు లక్ష్మీ నర్సయ్యకు / లక్షణమున పుడమి యందు / విలక్షణమున సంగయ్య యనుచు జననమైనాడు / రామనర్సమాంబకు రమణుడైనాడు / తన గురువు పొన్నాల రాజయ్య కృపచేత / తాగన్న నిజబోధ మీకు తెలుపుటకిట్లు / జననమైనాడు మనకెరిగించి మరుగునైనాడు.

1. 1899లో వికారి నామ సంవత్సర చైత్ర శు.దశమి రోజున లచ్చమాంబ లక్ష్మీనర్సయ్య పుణ్య దంపతులకు నల్గొండ జిల్లా శిరికొండ గ్రామమున జన్మించిరి.
2. కాళ్లు చేతులు కదపలేని అనారోగ్యముతోనున్న పద్దూరు దొరవారికి 40 రోజులు తీర్థ ప్రసాదములు ఇస్తూ, దొరవారి ఇంట్లోనే యుండిరి. అంతటితో ఆ దొరవారు పూర్తిగ నయమాయెను. దానితో దొరవారు గురువుగారి మహత్తుకు మెచ్చి 30 ఎకరాల స్థలమును ఇచ్చి సత్కరించెను.
3. 1950 సంవత్సరములో శ్రీ దయానంద పొన్నల రాజయోగీంద్రుల వద్ద శ్రీ వివేకానంద అను దీక్షిత నామముతో పాటు అధికార పత్రాన్ని పొందియుండిరి.
4. దేశ పర్యటన చేస్తూ 1976లో బచ్చన్నపేటలో స్థిరపడినారు. భక్తులు వీరికొరకు బస్టాండు ఎదురుగా 1000 గజాల స్థలములో ఆశ్రమము నిర్మాణము చేసియుండిరి.
5. వీరికి శిష్యులు వేల సంఖ్యలో ఉన్నారు. శిష్యులకు శివరామ దీక్షిత బోధను పంచీకరణ పద్ధతిలో చాలా పటిష్టముగా నేర్పించియుండిరి. ఈ సాంఖ్యము ద్వారా మానవులు మంత్రోపాసకులు - భక్తులు మతముల వారు - యోగాభ్యాసకులు - తత్త్వ విచారకులు మరియు బ్రహ్మము - ఆత్మ ఈ సూత్రాత్మ పంచభూతముల ద్వారా చేసే పనులు ఏమిటి? బ్రహ్మాండములోను, పిండాండములోను ఏ విధముగా సంచరించుచున్నది అన్న విషయము, ముల్లు గుచ్చ సందులేక ఉన్న పరిపూర్ణమును -లేనటువంటి ఎరుకను తెలియజేసి ఉత్తీర్ణులను చేసియుండిరి. భక్తులు వీరి పేరున 1. సంగమేశ్వర శతకము, 2. సంగమేశ్వర సంకీర్తనావళి అను తత్త్వములువ్రాసి గ్రంథములు చేసిరి. వీటిని క్యాసెట్లు, సీడీలు కూడా చేసియున్నారు. సాంఖ్యము - తారకము - అమనస్కము - మహావాక్యముల ద్వారానే పరిపూర్ణ బోధ సులభ అవగాహన కాగలదు కావున మీరు సాంఖ్యమును గురుముఖంగా నేర్చుకుని పరిపూర్ణ భావాన్ని పొందగలరని భావించుచున్నాము.

## శ్రీ మద్రామడుగు శివరామ దీక్షిత గురూప పీఠం

బస్టాదు ఎదురుగా, బచ్చన్నపేట - 506 221, వరంగల్ జిల్లా, ఆం.ప్ర.

# గురుగీతలో గల గుర్వ్యష్టకములకు తెలుగు సేత

## (బ్రహ్మమురార్చిత లింగం అనుమాదిరి)

1. ధన ధాన్యంబులు దారా గృహములు - పుత్రులు పౌత్రులు బాంధవులున్నా
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

2. వేద శా ములు పాండిత్యంబులు పద్య గద్యము కలితలుయున్నా
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

3. దేశ విదేశములందున పూజ్యుడు సదాచార సంపన్నుడు యైనను
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

4. రాజ్యములేలే రాజుల చేతను - పాదంబులు పూజింపుచుండినను
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

5. యోగము భోగము రాజ్యము లుండిన - సుందర స్త్రీసంభోగముండినను
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

6. దానము ధర్మము కీర్తి ప్రతిష్ఠలు ఎనిమిది దిక్కుల కెగసిన గాని
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

7. అడవినయుండిన యింటిలో నుండిన దేహము దేవుని పూజలొనుండిన
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

8. మణిమాదులచే తులతూగినను - కామిని కౌగిలి రాత్రుల యున్నను
గురు చరణంబులు మనసున నిల్పని వెన్నున్నా అవి నిష్ఫలమన్నా ॥ గు ॥

9. యతులు భూపతులు బ్రహ్మచారులును పుణ్య పురుషులు గృహస్థులైనను
గర్వష్టకములు చదివిన వారికి - కోర్కెలు దీరగ బ్రహ్మానందదము.

- శ్రీ అమలానంద పాటల పండరినాథ్

# పరిపూర్ణ బోధాష్టకములు

(బ్రహ్మామురారి సురార్చిత లింగం అను మాదిరి)

1. నిత్యనిరామయ నిర్మలరూప సత్యసనాతన సదమల రూపా
స్తుతిజేతుము మా మతిగురుదేవా - గతి నీవే యిల సతతము బ్రోవా ॥ ని ॥

2. దేహిని ఎరుగక దేహము జూచి మోహము జెందుదు రెందుకొ నరులు
దేహము వలెనే దేహియనిత్యము యూహను నీయవెవో గురుదేవా ॥ ని ॥

3. వాదము భేదము శా ములన్నీ మోదము కేదము సాధనలన్నీ
నాదము బిందువు కళలవి యన్నీ - నావే నేనను భావము బాపవె. ॥ ని ॥

4. ప్రకృతియై పురుషుం డాయెనటందురు - పురుషుండాయెను పొందెనటందురు
సంసారంబను సంద్రముదాటగ శక్తిని నీయవె శ్రీ గురుదేవా ॥ ని ॥

5. మూడు గుణంబుల మాయలమల్లీ- తోడుగ నీడగ నుండే దేవుడు
జగతికి సాక్షిగ నుండెనటుందురు - సాక్షిని బాపవె సద్గురు దేవా ॥ ని ॥

6. ఆస్తి బాతిప్రియ నామము రూపము - ఐదిటియందున మూడు బ్రహ్మమట
రెండు మాయయుట మొండిగ నందురు - ఖండితమన్నియు మాయయెదేవా ॥ ని ॥

7. కలలో రాజులు కన్నియలెందరో - కనబడ మురిసితె మేల్కొన లేవని
శ్రీ గురు మేల్కొ చె ఎరుక జగంబులు - కల్లని దెలిపిన చల్లని దేవా ॥ ని ॥

8. ఉన్నది బయలని సున్నయె ఎరుకని - సన్నుతి జేయుగ నెన్నిగ దేవా
ఎరుకను కల భ్రమ బాపగనిన్నే - శరణు వేడితిమి సద్గురు దేవా ॥ ని ॥

9. పాటల పంఢరినాథుని బ్రోచిన - దయానంద శ్రీ గురు రాజేంద్రా
గుర్వష్టకముల గురితో జదివిన - వారికి జన్మము లేదిక మరలా ॥ ని ॥

- శ్రీ అమలానంద పాటల పండరినాథ్

# ఆరోగ్య సూత్రములు

1. దేహము ఏ వస్తువుతో తయారు చేయబడినదో ఆ వస్తువు హెచ్చు తగ్గుల వలన అనారోగ్యము కలుగును. అందుకని నీరు, అన్నం, గాడ్పు, వేడిమి పరిమిత పద్ధతిలో ఉండవలెను. దేహము అనారోగ్యము కాదు.

2. ఆరోగ్యముగా ఉండాలంటే పరిమితమైన ఆహారము, సాత్విక ఆహారము, పరిమితమైన నిద్ర, పరిమితమైన పనులు ఉన్నట్లయితే దేహము అనారోగ్యము బారినపడదు.

3. శరీరము చిన్న చిన్న బాధలకు గురి అయినప్పుడు డాక్టర్ ఇచ్చే ఇంజక్షన్లు, గోలీలు వాడకూడదు. ఈ శరీరమునకు లంకణము పెట్టాలి. అయితే, అనారోగ్యమునకు గురికాకుండా ఎల్లప్పుడూ ఆరోగ్యముగా ఉందురు. అన్నం భుజించుటకు ఆకలి ఉండాలి. భుజించిన అంత్య భాగము విసర్జన చేసే పద్ధతి సరిగా ఉండాలి.

4. పాలలో టి పొడి కలిపితే ఛాయ్ అవుతుంది. అనగా పేరు మారినది. పాల గుణము కూడా మారినది. అలాగే మనము తీసుకునే ఆహారము అనేకమైన వస్తువులతో కలిసినట్లయితే ఆ ఆహారము యొక్క గుణం కూడా మారిపోతుంది. అనారోగ్యమునకు దారితీస్తుంది. అందుకే ప్రకృతితో వచ్చిన శాకాహారము మాత్రమే భుజించవలెను. రుచి కొరకు కొంచెం మోతాదులో ఏదైనా కలపవచ్చును. అనేకములైన వస్తువులు కలపవద్దు. ఇలా ఆరోగ్యముతో కలకాలము ఉండగలవు.

5. మాంసాహారము ఆరోగ్యమునకు మంచిది కాదు. మాంసం మాంసేన వృద్ధి, జ్ఞానము నవృద్ధి. అనగా కండబలము పెరుగుతుంది కాని బుద్ధిబలము పెరగదు. ఇది సిద్ధాంతమునకు పనికిరావు. పద్ధతి కాదు. అంతేకాదు, మాంసము భుజించిన జీర్ణమగుటకు 12 గంటల సమయం పడుతుంది. శాకాహారము కేవలం రెండు గంటలలో జీర్ణమవుతుంది. అనగా దేహము అను మిషన్ 10 గంటలు అదనంగా పనిచేయడం వలన ఆయుష్షు క్షీణించును.

6. మద్యపానం చేయువారు అధోగతిపాలగుదురు. మద్యపానం చేయాలంటే కనీసం రూ.300/- ఖర్చవుతుంది. ఆ మద్యం తాగి శరీరం పాడైతే డాక్టర్‌కు మరో రూ.300/- ఖర్చవుతుంది. అలాగే రూ.600/- నష్టం. ఇలా నెలకు మూడుసార్లు జరిగితే రూ.1800/- ఖర్చవుతుంది. అలా జీవితం ఆర్థికంగా చితికిపోవడమేగాకుండా, ఆరోగ్యరీత్యా అథోగతి పాలగుదురు. అందువలన మద్యపానానికి దాసోహం కావద్దు.

7. దేహము అన్నంపై ఆధారపడియున్నది. ఆత్మ దేహముపై ఆధారపడి యున్నది. ఉపాధి ఉంటేనే ఆత్మ ఉన్నది. అన్నము ఉంటేనే దేహము ఉన్నది.

8. అన్నము సూక్ష్మభాగము. మనసు నీటి సూక్ష్మభాగము. ప్రాణము దేహమునకు ముఖ్యమైనవి ప్రాణము, మనస్సే. అందుకే నీరు మరియు అన్నము పరిశుద్ధమైనవే ఉండాలి.

9. అందుకే ఆరోగ్య నియమాలు పాటించుము. సంపూర్ణ ఆరోగ్యంతో సంపూర్ణ ఆయుష్షు కలిగియుందుము.

**ఆరోగ్యమే మహాభాగ్యము.**

# గురు పరంపర

1. శ్రీ దక్షిణామూర్తి సద్గురు
2. శ్రీ మహావిష్ణు భగవాన్ సద్గురు
3. శ్రీ సూర్యభగవాన్ సద్గురు
4. శ్రీ యాజ్ఞవల్కి సద్గురు
5. శ్రీ జనక మహారాజు సద్గురు
6. శ్రీ శుకమహర్షి సద్గురు
7. శ్రీ సాందీప పరమాత్మ సద్గురు
8. శ్రీ కృష్ణపరమాత్మ సద్గురు
9. శ్రీ అర్జున సద్గురు
10. శ్రీ రామానంద సద్గురు
11. శ్రీ సహజానంద సద్గురు
12. శ్రీ కబీర్ సద్గురు
13. శ్రీ జ్ఞానేశ్వర యోగి సద్గురు
14. శ్రీ అంబికా శివ సద్గురు
15. శ్రీ వేమనయోగి సద్గురు
16. శ్రీ వేంకయార్య సద్గురు
17. శ్రీ తిరువేంగళ సద్గురు
18. శ్రీ శ్రీధర స్వామి సద్గురు
19. శ్రీ శివరామదీక్షిత సద్గురు
20. శ్రీ కంబాలూరి అప్పయ్య బ్రహ్మ సద్గురు
21. శ్రీ పరశురామసీతారామస్వామి సద్గురు
22. శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువులు
23. శ్రీ ఫీల్కాన లక్ష్మణ దేశిక ప్రభువులు
24. శ్రీ ఫీల్కాన శంకర్ దేశిక ప్రభువులు
25. శ్రీ పగడాల వెంకటేశ్వర అవధూత సద్గురు
26. శ్రీ భూమానంద మందిప్పల హనుమ్మంత సద్గురు
27. శ్రీ దయానంద పొన్నాల రాజయ్య సద్గురు
28. శ్రీ దయానంద పొన్నాల అనసూయాంబికా సద్గురు
29. శ్రీ దయానంద పొన్నాల సాందీపినీ సద్గురు
30. శ్రీ వివేకానంద ఆగోలు సంగయ్య సద్గురు
31. శ్రీ విజయానంద వీరంత బ్రహ్మచారి సద్గురు

## అచలఋషి సాంప్రదాయక నిజగురు పరంపర ధ్యానం

ఓం నమో బ్రహ్మాదిభ్యో। బ్రహ్మవిద్య సాంప్రదాయ కర్తృభ్యో। వంశఋషీభ్యో। మహద్భ్యో। నమో గురుభ్యః। సర్వోపస్లవ రహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థో। బ్రహ్మై వాహమస్మి అహంపదార్థ రహితః॥

శ్లో॥ వేదశా విధిఖ్యాతం। పూర్ణబోధోపదేశికమ్।
సుగుణాకరం దయానందం। రాజయార్య గురుంభజే॥

శ్లో॥ అనసూయాంబికాందేవీం గురో శ్రీ రాజయోగినః
పత్నీంశ్రీమాతరం భక్త్యా వందేహమ్మానసాంతరే॥

శ్లో॥ శ్రీ అచలర్షి గోత్రసాగర పూర్ణ చంద్రం।
శ్రీ రాజయోగి నాభోద్భవ బ్రహ్మతేజం॥
శ్రీ పొన్నాల్వంశ వృక్షోద్భవ పారిజాతం।
శ్రీ సాందీపినీ సద్గురు మనిశంభజామి॥

శ్లో॥ సత్యాచల పూర్ణ సిద్ధాంతం వివేకానంద దీక్షితం
ఆగోలు సంగయాఖ్యం సద్గురుతే నమోనమః
సంగయాఖ్య గురోర శిష్యం విజయానంద దీక్షితం
వీరంత బ్రహ్మచారాఖ్యం సద్గురుతే నమోనమః

అస్మద్గురు సమారంభాం। కృష్ణ సాందీప మాధ్యమామ్।
శ్రీ మహావిష్ణుపర్యంతం। వందేగురు పరంపరామ్॥

★ ★ ★

### పరిపూర్ణ అచల ధ్యానం

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం। ఆగ్నేయే నిర్గుణంతథా,
దక్షిణేనిత్య శుద్ధంచ। నైఋత్యే నిరుపద్రవం॥

శ్లో పశ్చిమేం నిష్కళం చైవ। వాయవ్యేచ నిరంజనం,
ఉత్తరేచ నిరాకాశ। మీశాన్యే నిర్మలోభవేత్॥

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం। అధశ్చ నిర్వికారకః,
అంతర్బహిశ్చ సర్వత్ర। అచలోయం సనాతనః॥

# జెండాపాట

జెండాను పైకెత్తుమన్నా
అచల జెండా మర్మామేమో తెలుసుకొండన్నా || జెండాను ||

1. జాతి బేధములు లేవన్నా
నిజ జాతి ఒకటేనని తెలియజేయన్నా
కుల మతము తేడా లేదన్నా
గురు కులము ఒకటేనని చాటుచుండన్నా || జెండాను ||

2. వేదముల కాదియగుదన్నా
ఇది సాదు సజ్జనులకు సాధ్యమగునన్నా
ఉపనిషత్తులు ఎందుకన్నా
దీని ఉపము తెలిపే గురుడు కావలయునన్నా || జెండాను ||

3. బాధ లేమియు పెట్టదన్నా
భోద మర్మం ఎరుగ సద్గురుని చేరన్నా
జనక మహారాజుది జెండా
రారాజ మార్గము చూపి నడిపించు అండా || జెండాను ||

4. శ్రీధరుల స్వామిది జెండా
జనులకు బాధలు తొలగించుచుండా
శివరామదీక్షితుల జెండా
భవరోగములు పూర్తిగా పోగొట్టు జెండా || జెండాను ||

5. పొన్నాల రాజేంద్రుడన్నా
జనుల జన్మ రహితము చేయగావించేనన్నా
ఆగోలు గురు సంగయాఖ్యులు
సకల జాతి వారికి బోధ అందించేనన్నా || జెండాను ||

6. పూలవర్షం కురుపుదాము మనము
పూజించి గురు కృపకు పాత్రులవుదామా
విజయ వీరంత బ్రహ్మాచారన్నా
నిజగురువులా సేవింప మరువడోయన్నా || జెండాను ||

# గురు స్వరూపము

**జపస్తపొవ్రతంతీర్థం యజ్ఞోదానం తద్దైవచా**
**గురుతత్త్వమవిజ్ఞాయా సర్వంవ్యర్థంభవేత్ప్రియె**

జనులు గురు స్వరూపము యొక్క నిజస్థితిని తెలుసుకొనక చేసేటి జపమును తపమును గంగాది పుణ్యతీర్థ సేవయును యాగమును గోదానమును మొదలైన వన్నియును నిష్ఫలమైనవే యగును అనగా గురువు యొక్క నిజరూపము తెలువకయె పూజలు చేసిన ఏమీ ప్రయోజనము లేదు అన్నియూ నిష్ఫలములే.

**ఒక మేలుకొలుపులో చెప్పియున్నారు.**

మరచిపోయిన సస్వరూపము మరల నా మది యెరుక చేసియు, స్థిరముగా పరిపూర్ణ బోధను శరణనిన కరుణించి మురియుచు అన్నట్లుగా నీ వెక్కడినుండి వచ్చినావు, అసలు నీవెవరు అన్న విషయాన్నే మరచిపోయి మాయాలోపడి నా సంసారము, నా ఇల్లు, నా పొలము, నా ఆఫీసు, నా కుమారులు, నేను రెండు ఇళ్లు కొనాలి, బంగారం కొనాలి అని మాయలో పడి తన యొక్క స్వరూపమును (స్వంత రూపమును) మరచిపోయారు. అట్టి సస్వరూపమును తిరిగి చూచుకున్నట్లయితే, తానెవ్వరు అన్న విషయము తెలియవచ్చును.

**మరొక్క మేలుకొలుపులో ఇలా సెలవిచ్చినారు**

మాయ తనువై మాయ తానై మాయ పనులను చేయుచును మరి మాయ తన మర్మంబు గనెనె మాయమైపోయె - ఈ మాయ పోవాలన్న తన యొక్క నిజ స్థితిని గురువుఖంగా కనుగొనాలి. కనుగొనటంతోనే ఈ మాయ మాయమైపోయి నీ నిజస్థితి గానవచ్చును. నీవెవ్వరో తెలియవచ్చును. నీవు ఎక్కడికి వెళ్లెదవో తెలియువచ్చును. అప్పుడు బోధ ప్రారంభమగును.

# గురు వాక్యోపనిషత్తు

## పంచశాంతి

అనంతోపనిషత్తు నుండి పంచశాంతి మంత్రము యేమి తెలియచేస్తున్నదో తెలుసుకుందాము -

1. శ్లో. ఖంవాయుర్ జ్యోతిరాపః పృథ్వి విశ్వస్తదారనే
యత్ పరంబ్రహ్మ సర్వత్ర విశ్వసాయ తనంమహత్తు

2. శ్లో. సూక్ష్మాతి సూక్ష్మ పరం నిత్యం తత్త్వమేవత్వమేవతత్
జాగ్రత సప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ ప్రకాశితే
తత్ బ్రహ్మ హమితి జ్ఞాత్వా సర్వబంధై ప్రముచ్యతే.

3. శ్లో. యోవేదాదౌప్రాక్తో వేదాంతేచ ప్రతిష్టతః
తస్యప్రకృతి లీనస్య యః పరస్పర మహేశ్వరః

4. శ్లో. దృష్టదర్శన దృష్యానాం విరామోయ
త్రవాలబెల్// దృష్టస్య త్రైవకర్తవ్యా సానగ గ్రావలోకయె

5. శ్లో. అంతఃపూర్ణం భవాపూర్ణం / పూర్ణకుంభమివాంబని
అంతర్ శూన్యం బహిర్ శూన్యం శూన్య కుంభమివాంబరె

6. శ్లో. ఈశాన్య సర్వవిద్యానామ్ ఈశ్వర సర్వభూతానాం
బ్రహ్మదిపతి బ్రహ్మణాదిపతి బ్రహ్మశివోమే హస్తు సదాశివోహః

7. శ్లో. వాకూర్న సహన ప్యాయుం భద్రంకర్నె చరేవచ
పంచశాంతి పటేద్వాదౌ పటేద్వాకాయ నంతరం

**1 శ్లోకమునకు తాత్పర్యము :** వాయు భూతము - అగ్ని భూతము - జల భూతము - పృథ్వీ భూతమును - భరించుట యందు యే పరబ్రహ్మము అంతటా వ్యాపించియున్నదో ఆ మహత్తే అంతటా వ్యాపించుట వలన విశ్వమునకు ఆధారమనియు, స్థానమనియు చెప్పబడుచున్నది.

**2 శ్లోకమునకు తాత్పర్యము :** ఆ పరబ్రహ్మము సూక్ష్మాతి సూక్ష్మ అతి సూక్ష్మము అయివున్నది. ఆ బ్రహ్మ తత్త్వము నీవు - నీవే ఆ బ్రహ్మతత్త్వము ఈ బ్రహ్మతత్త్వమే. జాగ్రత్త - స్వప్న - సుషుప్త్యాదిగా ప్రపంచమునందు ప్రకాశించుచున్నది. అట్టి బ్రహ్మము నీవేనని తెలిసియున్నచో సర్వబంధముల నుండి విముక్తి కలుగును.

**3 శ్లోకమునకు తాత్పర్యము :** ఋగ్వేదము - యజుర్వేదము - సామవేదము - అధర్వణ వేదము - వీటి యందు వెలువడిన అనగా సర్వ వేదములయందు స్వరము అనగా ప్రణవము చెప్పబడినదో యే స్వరము వేదముల నుండి వెలువడిన 1180 ఉపనిషత్తుల యందు ప్రసిద్ధమైనదో, ప్రకృతి లీనమైయున్నదేదియో దానికి పరమైనదేదియో అదే మహేశ్వరుడు.

**4 శ్లోకమునకు తాత్పర్యము :** దుష్ట దర్శన దృశ్యములకు విరామము కల్గునో అక్కడనే దృష్టిని నిలుపవలెను కాని ముక్కు చివరి భాగమందు కాదు. నీలో ఉన్న వానియందు దృష్టిని కేంద్రీకరించుము. నీ వెరుగుము, నీ స్వరూపము గనుము.

**5 శ్లోకమునకు తాత్పర్యము :** సముద్ర జలము నందలి పూర్ణ కుంభము వలె అంతర్‌పూర్ణము బహిర్‌పూర్ణము అగుచున్నవి. అనగా- కుండ లోపల నీరే ఉన్నది, బయట నీరే ఉన్నది. అటులనే బ్రహ్మము అంతటా నిండియున్నది. ఆకాశము నందలి కుంభము వలె మాయ అంతర్ శూన్యం బహిర్ శూన్యం అగును. కుండలోపల ఆకాశమే బయటా ఆకాశమే ఉన్నది. కుండ లేదు. అటులనే నీవే లేవు. ఉన్నదేదో ఎల్లప్పుడూ ఉన్నది.

**6 శ్లోకమునకు తాత్పర్యము:** సమస్త విద్యలకు సర్వభూతములకు ప్రభువును, బ్రహ్మయు, బ్రహ్మోత్పత్తియు బ్రహ్మాదిపతియగు సదాశివుడు నాకు శుభములను నొసంగుగాక, నాకు శుభములను అందజేయుగాక.

**7 శ్లోకమునకు తాత్పర్యము:** వాక్పూర్ణము- సహన - ఆప్యాయ భద్రం - కర్ణేబి అను పంచ శాంతులను చేయువలయును. తదుపరి వాక్యాంతములను చదువవలెను. వేదముల నుండి వెలువడిన ఉపనిషత్తుల పఠనమునకు శాంతిమంత్రములు నిర్ణయించినారు ఉపనిత్తుల పఠనానంతరము శాంతి మంత్రములను పఠించవలెను. అటుల పటించని వారికి ఉపనిషత్తుల సారం తెలియక నిష్ఫలమగును. అందుకని శాంతి పాఠము యొక్క భావార్థము తెలుసుకొని ఆచరించవలయును.

భావార్థము ఆ బ్రహ్మ పదార్థమే నేననువాడు. దేహమే నీవని బ్రహ్మము నాకు దర్శనమగు గాక. వేదములు ప్రతిపాదించిన సత్యమును మనో వాక్కులను నాకు అందజేయుగాక.

ఆ పరబ్రహ్మము గురుశిష్యులగు మమ్ములను కాపాడుగాక. నా యొక్క ఇంద్రియములు ముఖ్యముగా జ్ఞానేంద్రియములు విషయాదులయందు ప్రవర్తించక పరబ్రహ్మము నందు నిలిచి తృప్తిని పొందుగాక. నా శ్రవణేంద్రియములను అచల గురు ప్రబోధల యందే నిలుపుము. ఉపాదుల జనన మరణ రహితమందు పరిపూర్ణ పరబ్రహ్మమై యుండునుగాని జనన మరణములందు చైతన్య బ్రహ్మము ఎండమావుల వంటిదని తెలియచేయును. ఈ శాంతి మంత్రముల సారమెరుగుము.

ఉపనిషత్తుల మేలుకొలుపులా ఉపమాన సారాంశమేమిటి అని విచారించగా ఈ జగత్తుకు కారణమైన వస్తువు ఏదైతే ఉన్నదో, సర్వ మతాలు దేని గురించైతే అన్వేషిస్తున్నాయో, జగత్తుకే అధిపతి అయినవాడు ఎవ్వడో అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు.

శ్లో. మన్నాద శ్రీ జగన్నాథ మద్గురో శ్రీ జగద్గురో మమాత్మ సర్వభూతాత్మ తస్మై శ్రీ గురవేనమః ఏకం అనేకం భవతి అనేకం యేకం భవతి ఆ ఆత్మనే. అందరి యందు అనగా సర్వ జీవోపాదుల యందు ఉన్నది. నాలో ఉన్నది కూడా ఆ ఆత్మనే. ఏకము అనేకముగా మారింది. ఆ అనేకం ఏకంగానే ఉన్నది. అట్టి పరమాత్మ దర్పణము చేసుకున్న యెడల సర్వబంధాలు అన్ని కూడా తెగిపోతాయి. అప్పుడు నీ ఉన్నావంటే జగత్తు నీవు లేకుంటే జగత్తు లేదు. నీతోనే జగత్తు. అందుకనే నేను అనే అహంను వదులుము. అలా వదులుతే ఉన్నదంతా పరిపూర్ణమే. లేదెన్నటికీ ఎరుగ ఇదిగో కనుగొనుము.

కం. ఈ ఉత్త బట్టబయలును / నీవిప్పుడు ఉండచూచి / నిజముగా యెరుకను / నీవని నేనని జగమని భావింపుమి / పిదప దీన్ని భాయుము నిషమున్ / నిజముగ దీన్ని భాయక నిషమున్ / శ్రీ వనితేషా రాజీవ సంభవ భవదేవేంద్రాదుల నింక సేవింప తలపెలా / భాయుము నిషమున్/ నిజముగ దీన్ని బాయక నిషమున్.

ఓ శిష్యుడా నీవు మొదట ఈ పరిపూర్ణ పరభయలు ఉన్నది కనుగొనుము. తరువాత ఎరుకను నీ పని. నేనని జగమని భావించుము. తదుపరి ఈ ఎరుకను సదా విడిచిపెట్టుము. ఇదియె నిజమైన పద్ధతి. మరువక యుండుము. ఎరుకను విడువక దానిచే నిర్ణయించబడిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వర ఇంద్రాది దేవతలను పూజించవలయునని తలంచకుమని భావము.

నేను లేకుండ జగత్తు లేదు. నేను లేకుంటే పంచభూతములు లేవు. నవగ్రహాలు లేవు. నక్షత్రాలు లేవు. ఏమి లేక ఉంటే ఉన్నదే పరిపూర్ణము.

కం. ఉన్నది పరిపూర్ణం / లేదెన్నటికి ఎరుక యనుచు / లెస్సగ దృఢ మౌదాకెన్నుము / నేబోధించిన తిన్నన ఈ బోధ శిష్య తిలక మరువకుమి / సుజనుల మ్రోల పలుక వెరవకుమి / నిన్ను కుమతులు వచ్చి / నీ లోతడిగితే వారి / కెన్ని విధములనైన వెరిగింపకిది శిష్యా / తిలకా మరువకుమి. సుజనుల మ్రోల పలుకా వెరువకుమి.

తా. ఓ శిష్యా తిలకమా అచల పరిపూర్ణ పరబయలు ఎల్లప్పుడూ ఉండునని మూలము లేక తొచుచున్న ఎరుక లేనిదని నీ మనంబున దృఢమగు వరకు నేను బోధించిన పరిపూర్ణ బోధను స్మరించుచుండుము. దానిని మరువకూడదు. దీనిని సుజనుల ఎదుట చెప్పుటకు నీవు ఎంతమాత్రం భయపడవద్దు. దుష్టులు నీ వద్దకు వచ్చి అనేక విధముల ప్రయత్నము చేసిన ఈ భావము అడిగినను వారికి ఈ పవిత్రమైన పరిపూర్ణ బోధ చెప్పకూడదని భావము. చెప్పినను వారికి తెలియబడక వాదోప వాదములు గావించెదరు. అందుకని అట్టి వారితో మాట్లాడకనే యుండుట ఉత్తమమని తెలియజేసి యున్నారు.

ఇవన్ని ఉపమానాల ద్వారా యేమి తెలియబడినది అనగా - జగత్తుకు కారణమైన వస్తువు... సర్వ మతాలు అదే గొప్పది అని అన్న వస్తువు. అది నీవే అయి ఉన్నావు. అట్టి బ్రహ్మము నీవే అయి ఉన్నావు అని తెలియబడినది. నీవు అయి ఉన్న బ్రహ్మము లేనే లేదని కొట్టివేసినాడు శివరామదీక్షితులు. మరియేమున్నది? అని విచారణ చేయగా, నీవు వచ్చి పోయే బయులే సర్వకాలము లందు సకల దేశము లందు సకల వస్తువులందు నిండి నిబిడీకృతమై ములు గుచ్చ సందులేక ఉన్నది. ఇందుకు పరశురామ సీతారామ స్వామి చాలా చక్కగా సెలవిచ్చినారు.

సీ. సకల దేశము లందు సకల కాలము లందు సకల వస్తువు
ల చంచలము లేక చావు పుట్టుక లేని ఈ ఉత్త బట్ట
బయులే కాని రెండొది లేదు లేదు కళలోన కను
కున్న గజము మేల్కొని చూడ లేశమైనను యేమి
లేని భంగి / భ్రమ యుక్తమైన మూలము లేని
గుర్తెరిగే శరీరం యేమి లేదు. ఇదియే గురువాక్య
పద్ధతి విదితముగను విమర్శించినవాడు వివేక ఘనుడు // రమ్య //
గుణదాను భద్రాద్రి రామ పరశురామ నర్సింహదాస సంరక్షితాహ్వ

నీవనే దేహమే లేదు. మిగతా ఉన్నదంతా ఉన్నది. నీవనే అహం లేదు. మిగతా ఉన్నదంతా ఉన్నది. దృశ్యరూపమైన ప్రపంచమే లేదు. మిగతా ఉన్నదంతా ఉన్నది. సకల వ్యవహారములు చేసే తెలివే లేదు. మిగతా ఉన్నదంతా ఉన్నది. నీవు లేవు. జగత్తు లేకుంటే యేదైతే ఉన్నదో అదే ఉన్నది. ఉన్నదేదో ఉన్నది. నేనన్నదే లేకున్నది. ఇందుకు శ్రీ భూమానంద మందిప్పల హనుంత రాజయోగి ముత్తాత గారు అనగా శ్రీ భూమానంద మందిప్పల హనుమంతరాజయోగి గారి ప్రియశిష్యులు శ్రీ దయానంద పొన్నాల రాజయోగి వీరి ప్రియశిష్యులు శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి వీరి ప్రియశిష్యులైన శ్రీ విజయానంద వీరంత బ్రహ్మచారి నేనేనండి. శ్రీ భూమానంద మందిప్పల హనుంత రాజయోగి ఒక తత్వాన్ని మనకందజేసినారు. ఈ తత్వము భూమానంద వాఖ్యత్రయము అనే గ్రంథంలో ఉన్నది.

★ ★ ★

# తత్వము

1. ఉన్నది గురుడన్నది నే / కన్న దంతట నున్నది /
ఉన్నదేమో ఉన్నది నేన్నదే లేకున్నది //ఉ//

2. యెరక మరుపులు గానిది అది / యేకమై తానున్నది /
గురునిచే మేల్కొన్నవారికి / పరమపదమై యున్నది //ఉ//

3. అండపిండము గానిది బ్రహ్మాండమేమన రానిది
దండిగా అధ్యారోప పండితార్థము లేనిది //ఉ//

4. మతమతంబులు గానిది / అది గతులకెన్నడు రానిది /
సతతము గురుసేవ జేసిన / సాధులకె గురుతైనది //ఉ//

5. జపతపంబులు గానిది అది జన్మ రహితంబైనది
చపలులై తిరిగేటి వారికి / చెప్పశక్యము గానిది //ఉ//

6. యాగయోగము గానిది అది / భోగభాగ్యము లేనిది /
జోగులు బైరాగులు అనే త్యాగులకు కనరానిది //ఉ//

7. సాధనంబులుగానది అది / బోధరూపంబైనది / మోదమలర
సమాధులచే సాధ్యంబు యెన్నడు గానిది //ఉ//

8. ముద్రలయిదునుగానిది అది / ముదితయవనము లేనిది /
చిద్ర రూపము గానిది అది / భద్రమై తానున్నది //ఉ//

9. వేదశా ముగానిది అది / వాదభేదము లేనిది /
సాధనంబులు యెన్ని చేసిన సాధ్య రహితం బైనది //ఉ//

10. జ్ఞానాజ్ఞానముగానిది అది / ఘనుల సాధ్యంబైనది /
స్వానుభావాతీతులకును సర్వసమరసమైనది //ఉ//

11. పంచీకరణము లేనిది అది / పంచశక్యము గానిది /
సంచితము లెడబాపునట్టి / సద్గురు మహిమైనది //ఉ//

12. మంత్ర మహిమలు గానిది అది తంత్రమే లేకున్నది
యంత్ర తంత్రంబులకు ఆవల స్వతంత్రమై తానున్నది //ఉ//

13. బూటకంబులు గానిది అది / మాటలకు పైనున్నది /
ఆటలకు పాటలకు మీరియు / అంతటా తానున్నది //ఉ//

14. సత్తుచిత్తులు గానిది అది / పుత్తబయలై యున్నది /
విత్తు చెట్టు మర్మమెరిగితే / విశ్వమే లేకున్నది //ఉ//

15. ఈశ్వరుండనరానిది అది / విశ్వరూపము గానిది /
విశ్వతైజస ప్రాజ్ఞులనెడు / వివరమేమియు లేనిది //ఉ//

16. యాత్రలేమియు గానిది అది / పాత్రమెన్నగరానిది /
ధాత్రిలో యీ సూత్రమెరిగిన దాతలకు వశమైనది //ఉ//

17. స్థూల సూక్ష్మము గానిది అది / చూపురూపులు లేనిది
కాలములు మూడింటి కావల / కర్మ రహితంబైనది //ఉ//

18. ద్వైతమన్నది లేనిది / అద్వైతమెన్నగ రానిది /
ద్వైత అద్వైతముల మీరియు / దోష రహితంబైనది //ఉ//

19. పిండరూపము గానిది / బ్రహ్మాండమన్నది లేనిది /
ఖండమగు పరమాత్మ ప్రత్యగాత్మలకు మీరున్నది //ఉ//

20. అష్టదళములు గానిది అది / అష్టదిక్కులు లేనిది /
సృష్టి స్థితి లయములకు ఆవల స్పష్టమై తానున్నది //ఉ//

21. హంసరూపము గానిది అది హింస యెన్నడు లేనిది /
సంశయంబులు లేక పరమ / హంస కావలనున్నది //ఉ//

22. ద్వాదశి మంత్రార్థ మెరిగితే / దైవరూపంబైనది /
సాధుజనులకు సమ్మతంబై శాశ్వితంబైయున్నది //ఉ//

23. షోడశీ మర్మంబు దెలసిన / శిష్యులకు యెరుకైనది /
మూడులోకంబులును ముగ్గురు / మూర్తులకు పైనున్నది //ఉ//

24. ధరలో శ్రీ శివరామదీక్షితు లెరుకపరచిన బయలది /
గురుతుగాను భాగవత శ్రీకృష్ణ గురువుల కెరుకది //ఉ//

25. గురుతుగా పీల్వాన లక్ష్మణ / గురువు పుత్రుల కెరుకది /
సరిగ చిత్తురి వేంకటేశ్వర సాధు సమ్మతమైనది //ఉ//

26. ధరలో ముక్తుల గ్రామమందున / పరమ భక్తుల కొరకది /
విరివిగాను హనుమయాఖ్యుడు / విశదపరచెను బోధిది //ఉ//

## తాత్పర్యములు

1. నేను అన్నదే లేదు కాని ఉన్నదంత ఉన్నది. నేను అన్నదే అహం. అదే లేదు. అది లేకుంటే అంతా పూరిపూర్ణమే.

2. ఎరుక మరుపులు దేహానికే పరిమితమై యున్నది పరిపూర్ణము అంతట నిండి నిబిడీకృతమై ములుగుచ్ఛ సందులేకుండ ఉన్నది. ఇది తెలియుటకు గురుముఖంగా తెలుసుకొని ఎరుక అనే కళ నుండి మేలుకొంటే పరమపదమై యున్నది.

3. ఇది అండం కాదు, పిండం కాదు, బ్రహ్మాండం కాదు. పండితార్థము కూడ కాదు. వీటన్నిటికి అతీతంగా ఉన్న పరబయలు గురునిచే గురుడు చెబితేనే తెలియబడుచున్నది. కాని అంత సులభము కాదు.

4. అది మతాలు కాదు, గతులు కాదు, సతతము గురు సేవ చేసి సాధించిన వారికే (సాధులకే) సాధ్యపడునది అని భావము.

5. ఇది కళ్ళు మూసుకుని జపము చేస్తే లభించేది కాదు లేదా చపలత్వం చెంది దేశమంత తిరిగితే లభించేది కాదు. ఇది కేవలం గురు శుశ్రూష చేసి విచారణ ద్వారా తెలుసుకున్నవారికే తెలియబడునది.

6. ఇది శ్వాసను సహస్రమునకు ఎక్కించునటువంటి యోగాభ్యాసముతోకాని అశ్వమేధ యాగము మొదలగు వాటితో కాని భోగభాగ్యాలు సంపాదిస్తే కాని సంసారమును త్యాగము చేసి జోలి కట్టుకుని సన్యాసిగా తిరిగితే కూడ సాధ్యము కానిది. ఇది సంసారమనే రాజయోగములో ఉండి గురుసేవ చేసిన వారికే సాధ్యమని తెలియజేసినరు. అతనికి దయవస్తే అర నిమిషంలో బోధ అన్నట్లుగా గురుశిష్య న్యాయముగానే సాధ్యపడును.

7. సమాధులకు మ్రొక్కిన కాని సమాధి అయినా కాని యోగాభ్యాసము అనే శ్వాసను బంధిస్తే కానితెలియబడదు. శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంతము ద్వార గురు బోధించే బోధవలన లభ్యమయ్యేది అది భావము.

8. ఇది ధ్యానముద్ర, రాజముద్ర, షన్ముఖిముద్ర, శాంభవి ముద్ర - ముద్రలు యేవియు కూడ కాదు. ముసలితనము, యౌవ్వనము లేనిది చిత్త రూపము. అది కూడ కాదు. అది ఎల్లవేళల మొదలుకొనలేక ఆది అంత్యములు లేక చలనమేమియులేక అచలపరిపూర్ణ పరబయలై భద్రముగా నున్నది అని భావము.

9. వేదశా ము అనగా 4 వేదాలు, వాటినుండి వెలువడినా1180 ఉపనిషత్తుల చదువవలెనా అనగా వీటితోటి

వాద బేధాలే తప్ప యేమి తెలియబడదు. ఇది కేవలం గురునిచే గురికన్నవారికే సాధ్యము అని భావము.

10. జ్ఞానము కాదు, అజ్ఞానమూ కాదు. స్వానుభవముతో గురువు చెంత ఉండి గురుక్రుపకు పాత్రులైన వారికే సాధ్యము.

11. అది పంచీకరణ అనవచ్చా అనగా కాదు, అది పంచడానికి అవకాశము ఉన్నదా, అనగా లేదు. సంచితకర్మ వీడదీయనటువంటి సద్గురు మహిమ.

12. మంత్ర తంత్రములు యేమైనా చేయబడ వచ్చా అనగా యేమి చేయరాదు. ఇది మంత్ర తంత్రములకు ఆవల స్వతంత్రముగా ఉన్నది. దీనికి యేది కూడా ఆధారం కాదు.

13. ఘూటకంబులుగా ఉన్నదా అంటే అదీ, కాదు. మాటలకు సాధ్యమైనదా అంటే అది కూడా కాదు. మాటలకు, ఆటలకు, పాటలకు మీరి అంతటా నిండివున్నది. అది గురుక్రుపకు పాత్రమైతేనే తెలియును. సత్యం, జ్ఞానం అనంతం. బ్రహ్మం అనే న్యాయమునా బ్రహ్మ సత్యమైనది.

14. చిత్త రూపములు కాదు ఈసత్తు చిత్తు ఆనందములే స్వరూపములైనది చూచునది చూడబడునది. ఇది యేమి కాక, యేమి లేక ఉత్త బట్టబయలై యున్నది. గురుముఖంగా దీనియొక్క మర్మమెరిగితే జగత్తే లేదు (విశ్వమే లేదు) అంతా బయలే ఉన్నది.

15. ఈశ్వరుడు కాదు ఈశ్వరునికి అతీతముగా ఉన్నది, విశ్వరూపము కానిది విశ్వమునకు అతీతముగా ఉన్నది. విశ్వత్తైజస ప్రాజ్ఞ, జాగ్రత్త స్వప్న శుషుప్తి అవస్థలు కానిది ఆపైన ఉన్నది. గురు డన్నది నేకన్నదంతటా ఉన్నది.

16. యాత్రలు చేస్తే సాధ్యమైనదా అది కాదు. ఈ భూమి మీద గురుదత్త అనే ప్రజ్ఞ గలవారికే సూత్రమెరిగిన వారికే వశమైనది అనగా వారికే తెలియబడుచున్నది.

17. స్థూల సూక్ష్మములు కానిది. రూపము లేనిది, చూపు లేనిది. కాల నియమము యేమున్న ఉన్నదా అంటే కాల నియమము లేదు. కర్మములు లేనిది అది కేవలాత్మగా నున్నది.

18. ద్వైతమనగా జీవుడు దేవుడు రెండు విధములుగా ఉన్నదా అనగా అలా లేదు. ద్వైతమనగా రెండు, అద్వైతమనగా రెండు కానిది అనగా. రెండింటికన్న అతీతముగా ఉన్నది. ఉన్నది గురుడన్నది నీకన్నదంతటా ఉన్నది.

19. పిండరూపము కాదు బ్రహ్మాండ రూపము కాదు. పరమాత్మ ప్రత్యగాత్మలు గాదు. ఇది అచల పరిపూర్ణ పరబ్రహ్మము. ఇవి అన్నిటికి మీరి ఉన్నది బయలైయున్నది.

20. అష్టదిక్కులు కానిది అష్టదళములు కానిది. పుట్టి చచ్చునది, జగత్తు కావల స్పష్టముగా ఉన్నది. గురు శుశ్రూష చేసి స్పష్టతను తెలుసుకోవలెను.

21. హంస రూపము పిండాండములో అనబడుచున్నది ఇది కాదు, పిండాండము లేదు, బ్రహ్మాండము లేదు కాదు యెలాంటి సంశయములు లేక వీటన్నిటి కావలనున్నది అచల పరిపూర్ణ పరబయలు.

22. ద్వాదశి మంత్రార్థ మెరిగితే హేతత్ మిథ్య శుద్ధ వియత్ కించిన్నాస్తి ఈ ఉత్త బట్టబయలులో యేమీ లేదు అని అర్థము. బయలే ఉన్నది ఇది సాధు సజ్జనులకు సమ్మతముగా ఉన్నది.

23. షోడాశాక్షరి మంత్రం తెలుసుకున్న వారికి క్లుప్తముగా తెలియబడుచున్నది. నిర్మూలమితదా జ్ఞాన శరీరం నాస్తి కేవలం. మూలము లేని గుర్తెరిగే ఈ శరీరం యేమి లేదు. ఈ ఉత్తబట్టబయలులో యేమీ లేదను. మూలం లేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు. మరియేమున్నది అనగా ఈ ఉత్త బట్టబయలే సకల దేశములందు సకల కాలములందు సమస్తమైన వస్తువులందు నిండి నిబిడీకృతమై ములుగుచ్చ సందులేక ఉన్నది.

24. ఈ భూ మండల మందు శివరామదీక్షితుల వారు తెలియచేసిన బయలది ఈ వివరము భాగవత కృష్ణదేశిక ప్రభువుల వారికి బాగా తెలుసు. తెలియబడినది అందుకే ఆయన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దర్పులు వ్రాసి మనకందచేసినారు.

25. వరుసగా భావగత కృష్ణదేశిక ప్రభువుల వారి ప్రియశిష్యులు ఫీల్ఖాన లక్ష్మణ దేశికులు ఫీల్ఖాన శంకర దేశికులు వీరి ప్రియశిష్యులు శ్రీ సచ్చిదానంద పగుడాల వేంకటేశ్వర అవధూత స్వామి వారు. వీరి ప్రియశిష్యులు శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి, కనుక వీరి పెద్దలు అందరూ యెరిగిన విషయమై ఉన్నది.

26. మహబూబ్‌నగర్ జిల్లా మక్తల్ గ్రామమందు జన్మించిన శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగీంద్రులు పరమ భక్తుల కొరకు శ్రీ భూమానంద వాఖ్యత్రయము అనే గ్రంథములో ఈ బోధను విశదపరిచినారు.



శ్రీ సచ్చిదానంద పగడాల వెంకటేశ్వర
అవధూత స్వామి వారి ప్రియశిష్యులు

**శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగీంద్రులవారు**

వీరి ప్రియశిష్యులు శ్రీ దయానంద పొన్నాల
రాజయోగీంద్రులవారు

ఓం

శ్రీ గురుభ్యోనమః

# అచల పరిపూర్ణ భావము - దేశములోని సాంప్రదాయము

శ్రీశ్రీశ్రీమద్రామడుగు శ్రీ శివరామ దక్షితుల వారు ప్రపంచంలో గల ఆధ్యాత్మిక సిద్ధాంతములన్నీ పరిశీలించి అచల పరిపూర్ణ సిద్ధాంతమును అన్ని సిద్ధాంతముల కంటె అతీతమైనదిగా, స్వచ్ఛమైనదిగా నిర్ణయించినారు. ఏలాగనగా, ఆది కవి వాల్మీకి రచించిన రామాయణము వాల్మీకి మహాఋషి, శ్రీ వశిష్ట మహాఋషి, శ్రీ విశ్వామిత్ర మహాఋషి అందరు కలిసి శ్రీ రామచంద్రులకు బోధించిన 32వేల శ్లోకములతో యోగవాశిష్ట రామాయణము, జ్ఞాన వాశిష్టము, శ్రీ వేద వ్యాసులచే రచింపబడిన అష్టాదశ పురాణములు 6 శా ములు, 4 వేదములు భారతము, భగవద్గీత, ఉపనిషత్తులు వాటి నుంచి పుట్టిన అనేక మతాలు దీక్షితుల వారు క్షుణ్ణంగా పరిశీలించినారు. అందరూ జ్ఞాన రూపమగు ఎరుకనే బ్రహ్మమని, అచలమని, పరిపూర్ణమని, నిర్గుణమని, నిరాకారమని, నిర్వికారమని - అటువంటి అచల పరిపూర్ణ బ్రహ్మమేనని ఇట్లు తెలియుటే మోక్షమని జన్మరాహిత్యమని అనేక రకాలుగా భావించి దాన్ని సాధించడమే పరమార్థమని సిద్ధాంతాలు చేస్తూ వచ్చినారు. ఇంకా చేస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో శ్రీ శివరామదీక్షితుల వారు ఇందులో లోపాలు కనిపెట్టి, నిజమును వెలికితీసి ముముక్షువులను సాధక లోకానికి విముక్తి కలిగించినారు.

జ్ఞాన రూపమగు ఎరుకను నేనని తెలిసినా తెలియకున్నా అది నీవయ్యే ఉన్నావని తెలియనపుడు అజ్ఞానని, తెలిపినపుడు జ్ఞానినని అనుకున్నా జ్ఞాన అజ్ఞానములు రెండు నీవేకాని వేరుకాదు. కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా ఎన్నో యోగాలు చేసి ఎన్నో గ్రంథాలు చదివి ఎన్నో మతాలు స్థాపించి ఇవన్నీ కష్టాలు పడి చివరకు నేను జ్ఞానమును ప్రజ్ఞాన బ్రహ్మమును, నేను అన్నిటిని ఎరిగే ఎరుకను నేను సర్వసాక్షిని, నేను చైతన్యాన్ని నేను అధిష్టాన బ్రహ్మమును. నేను అంతటా వున్నాను. నేను అచల పరిపూర్ణ బ్రహ్మమును అని ఆనందపడుకుంటూ సన్యాసులమని, మతకర్తలమని, మత అనుయాయులమని అనుకుంటూ యున్న సమయంలో ఈ మాటలలో వారి భావములలో ఉన్న లోపాలను వెలికితీసి నిజమును నిర్ధారించిన మహానుభావులు దీక్షితులవారు. నేను అచలమును అని, అచలము మాట్లాడుతుందా నేనే పరిపూర్ణమును అని ఇతరులకు చెప్పుతుందా, నేను నిర్గుణుని అని చెప్పే గుణము నిర్గుణమునకున్నదా, నేను నిర్వికారుని అని చెప్పే వికారము నిర్వికారునకున్నదా. నేను దేహములేని వాడ్ని అని చెప్పే దేహము నిర్దేహికి ఉన్నదా, చెప్పేది, వినేది ఎరిగేది ఎరుగబడేది ఇవన్నీ అచలానికి గాని పరిపూర్ణానికి గాని లేవు. ఈ ద్వంద్వాలు పరిచ్ఛిన్న యందు భిన్నత్వమందు వుంటాయి గాని పరిపూర్ణమందు వుండవు. పరిపూర్ణ ఎరుకలు ఎట్టివో అచల గురువుల ద్వారా తెలియకపోతే ఇటువంటి గజిబిజి భావాలు తప్పవు. చలించకుండా వుండేది ముల్లు గ్రుచ్చ సందు లేనిది పరిపూర్ణము పుట్టబడేది, పుట్టించేది అనే గుణాలు లేనిది పరిపూర్ణము. సంభవామి యుగే యుగే అనేది అచల పరిపూర్ణము కాదు. నేను నిర్గుణమని, నిరాకారమని పరిపూర్ణము ఎప్పుడూ అనదు. ఈ

పరిపూర్ణ పరబ్రహ్మ రెండవ ప్రకారము ఎప్పుడు కాలేదు. వెనుక కాలేదు. ఇప్పుడు కాలేదు. ఇకముందు కాదు. ఇటువంటి పరిపూర్ణ పరబ్రహ్మమును గురు సూచన ద్వారా తెలియకుండా నేను పరిపూర్ణమును, నేను అచలమును అనే వాళ్లు అసాంప్రదాయకులే కాని సాంప్రదాయకులు కాదు. నేను దేహమును కాదు, ఆత్మను నేనని అనుకునే వారికి దీక్షితులు చెప్పిన మాటలు స్నానము నీవే చేయవలెను కాని దేహమునకు ఏలచేస్తివి. నీవే గుడ్డలు వేసుకొనవలెను కాని దేహమునకు ఏల వేస్తివి. నీవే నామాలు పెట్టుకొనవలెను, కాని దేహమునకు ఏల పెట్టితివి, క్రియలో దేహము, దేహి రెండు ఒకటిగా ఉన్నా మాటలలో మాత్రమే వేరుగా వున్నట్లు, మాట్లాడి వారికి నిజము తెలియదు అన్నారు. దేహి దేహములను వేరుచేసి మాట్లాడే వారికి భ్రాంతి తప్పదు. వారికి పరిపూర్ణ బోధ తెలియదు. చలించని పరిపూర్ణమును తెలియక నేనే పరిపూర్ణమును అనే వారికి శనగల పూర్ణమే కాని పరిపూర్ణము తెలియబడదు. అందుకే ఈ లోకములో వున్న సకల సిద్ధాంతములకు సర్వమతాలకు తెలియని నిజబోధ పరిపూర్ణ బోధ ఏమీ లేని మాయను రెప్పపాటులో బొక్క పెట్టిపోయే మాయను నిజమని అచలమని పరిపూర్ణమని అనుటకు సిగ్గుకాదేమో అన్నారు పెద్దలు.

కం. అహమనదు కదా అచలము / అహమున్నదో లేదో చూడనిది నిజమే కదా / అహమును పుట్టించదు గదా అహముదయించేటి వరకు అది వున్నది కదా / అహమే విశ్వమై నిల్చింది కదా. అహమే యీ ముచ్చట్లు నన్నియెన్నోరుగును కదా / అహమే తానేనని యెరిగితే సరిగద.

ఇది పరిపూర్ణ బోధ విజయానంద వీరంత బ్రహ్మచారి గారు కూడా దీక్షితుల వారి వలెనే శాస్త్ర లోకాలకు భయపడకుండా ఈ దేశములో ఉన్న శ్రీ శివరామ దీక్షితుల సాంప్రదాయాన్ని అంతా ఈ క్యాలండర్ మరియు అచల బోధ అంతర్గామి ద్వారా ఈ వారధిని నిర్మిస్తున్నందుకు ఆయనకు సద్గురుదేవుడు అన్ని విధాల ఆశీర్వదించాలని భావ నిర్ణయముగా కోరుచున్నాను.



ఇట్లు
నిజ గురుపద సేవకుడు
**సభా సామ్రాట్ శ్రీ వివేకానంద**
**బండారు సుబ్బరాయ స్వామి**
సేవా సమాఖ్య అఖిల భారత అధ్యక్షులు.
ధర్మవరం, అనంతపురం జిల్లా.

ఓం

శ్రీ శివరామ దీక్షిత అచల గురవేనమః

# శివరామ దీక్షితుల ప్రత్యేకత - దీక్షితీయ ప్రభావము

## అన్నింటికీ అతీతులు - అశరీరులు - వర్ణనాతీతులు - శ్రీ శివరామ దీక్షితులు - ఎందుకనగా?

జన్మరాహిత్యమగు పూర్ణబోధతో, వారియొక్క స్థితి, ఉనికి ఎంతటివారూ గ్రహించరానిది. అసలు ఈ జనన మరణములకు మూలముగాని, కర్తగాని, ఎవ్వరూ లేరు. వున్నదనుకున్నవారు మహామూర్ఖులు.

కం. ఎరుకను కళలోపల నేనరుదెంచితి / మీరలట్లె అరుదెంచితిరీ / గనుక ఈ జనన మరణములలో / సుఖంగాని శాంతి గాని / ఈషత్తైనా లేదు / ఉన్నదనుకున్న వారికి / సుఖ దుఃఖాలు పాపపుణ్యాలు రెండూ వదలవు/ గనుకఈ జనన మరణములనే కలను మేల్కొన ప్రయత్నించువాడే కడుంగడు ధన్యాత్ముడు, మహాఘనుడు, ఇందుకు నిజగురువు కావలె. ఇదే శ్రీ శివరామ దీక్షితుల వారి బోధనలో గల ప్రత్యేకత.

అదీగాక, ప్రపంచమందు గల సర్వ మతాల వారు, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమునే దేవుడని నమ్మి కొలుస్తున్నారు. ఎట్లనగా, 840 ఉపనిషత్తులు కర్మకాండ మతస్థులు, 232 ఉపనిషత్తులు, ఉపాసనాకాండ మతస్థులు. మరియు జ్ఞానకాండ మొదటి రెండు భాగములలో 98 ఉపనిషత్తులు. ఈ గుర్తెరిగే జ్ఞానం ఈశ్వరుడే దేవుడని బోదించిన సాంఖ్య మతస్థులు. వీరలందరూ జన్మఫలముల కాశించినవారే గనుక నిజ గురుపుత్రులు. ఇవి నమ్మరాదని దీక్షితులవారు బోధించెను. మరియు జ్ఞానకాండ చివరిభాగంలో, దశోపనిషత్తులు బోధించిన అఖండ ఎరుక కనబడు బ్రహ్మతత్వము. ఇది క్షరాక్షర విలక్షణమై, సర్వశూన్యంగా, సర్వజీవులందు పరిపూర్ణము వలెనే ఉండును. దీనినే దీక్షితులవారు కనరాని లేని కలయని, ఇది అచలము నందు లేదు. గనుక సకల శరీరములందు లేకవుండును అన్నారు. దీన్నే భా.క్రి.ప్ర. అఖండంబగు ఎరుక రూపు గనరా మా తండ్రీ. ఇది దెల్పిన ఘనుడే తల్లిదండ్రి. అన్నారు. దీనికే పండితారాధ్యులు, అన్నింటి యందు నేను లేని వాడనైయున్నాను. పరిపూర్ణ మందు నా పుట్టుకయే లేదు అన్నారు. ఈయఖండ ఎరుక కనబడు. గురుతత్వమును ఆదిలో అభ్యాసులు అభ్యాసాతీతులైన గురుపుత్రులు. ఆచరణలో దైవమని నమ్మాలని సుజ్ఞాన గురుదీపికలు బోధించెను. మరియు అఖండులైన అద్వైత జ్ఞానులు శ్రీశంకరులు. శ్రీ రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, వీరబ్రహ్మము. వీరు ఈయఖండ ఎరుకలేమిని గ్రహించలేక దాన్నే దేవుడని

జన్మరహితమని నమ్మి ఆగిపోయిరి. వేయేల, పూర్వులైన హరిహరాది జనక శుకసాంధీప శ్రీకృష్ణులు సైతం ఈ యఖండ ఎరుక లేమిని కాదనలేక ఉన్నదన లేక ఎంతమంది శిష్యులు చేరిప్పటికీ ఇది అందదని భయంతో ఒక్కొక్కరికే పూర్ణ బోధ నిజమును చెప్పి ఆపి వేసేశారట. ఇదంతా కనిపెట్టి దీక్షితులవారు ఇలాక్కాదని బాగా ఆలోచించి దీక్షితీయమను అచల గ్రంథమును చక్కగా వ్రాసిరి. అందు ద్వాదశి షోడశి, పంచదశీ దృష్టాంత కర్పూర దీప సంయోగ ద్రాష్టాంతముల చేత పరిపూర్ణ బోధను బయటపరచి, ఎందుకు ఆదిని నిశ్శేష్టముగా తొలగించెను. అలాగే శ్రీ దీక్షితీయ బోధ వాక్యములనే అథారిటీ తీసుకుని శ్రీ భాగవత క్రిష్ణ దేశిక ప్రభువరులు మరియు శ్రీ మత్పండిత శివానంద ప్రభువు. చక్కని అచల గ్రంథములు రచించి, శ్రీ శివరామదీక్షితుల వారి కీర్తి శాశ్వితంగా, భూలోకమందు స్థిరస్థాయిగా ఉన్నట్టు, అచల బోధను వెదజల్లిరి. గనుకనే ఈ అచల సాంప్రదాయంలో శ్రీ శివరామదీక్షితుల వారి నామము లేని ఆశ్రమములుగా పీఠములుగా లేవు అని గ్రహించవలెను.

జై సద్గురు ప్రభు మహారాజ్‌కీ జై



ఇట్లు
**అతీత భావ మధుర కవి రత్నం**
**నిర్మల నిజానంద రౌతు రామకృష్ణ స్వామి**
పీఠాధ్యక్షులు, తొంగ్రడంగి పోస్టు, వయా శ్రీరామ్‌నగర్ - గరివిడి,
విజయనగరం జిల్లా - 535 101, సెల్: 95508 10228

# శ్రీ నందన నామ సంవత్సరమున అశరీరులైన పెద్దలు

1. **శ్రీ విభుదానంద అనంతుల మన్నె రామయ్య రాజయోగి**
   మల్కాపేట, తూప్రాన్ మండలం, మెదక్ జిల్లా.
2. **శ్రీ నిత్యానంద సత్యశోధనాచార్య కుర్వ సుబ్బారాయులు** - అనంతపూర్
3. **శ్రీ ప్రబోధరత్న నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు** - వరంగల్
4. **శ్రీ పువ్వాడ సత్యానంద స్వామి** - ప్రొద్దుటూర్

# శిష్యునిగా చేరదలచిన వారి అర్హతలు - చేరిన వారి సంస్కారము

ఆత్మబంధువులారా, ప్రియాత్మ సోదరులారా, శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాక గురువును చేరి నిజ బోధ మర్మధర్మములు తెలుసుకొని జన్మరహిత పద్ధతి పొందవలసిన శిష్యుని అర్హత ఎలా వుండాలి? ఏ విధంగా ఉంటే అచల పరిపూర్ణబోధకు అర్హుడౌతాడు? అన్న చిన్న మాటలతో తెలియజేసుకుందాము -

జన్మ రాహిత్యము కావాలని కోరినవాడు - పూర్వమందు పూర్వ ఆశ్రమముల యందు తిరిగి తిరిగి విసుగుచెంది యున్నవాడు కావాలి. ప్రపంచంలో ఎన్నో మతాలు, ఎంతో మంది గురువులు, స్వాములను ఆశ్రయించి ఉండవలెను. ముఖ్యంగా తల్లిదండ్రుల సేవ మొదట చేసినవాడై ఉండాలి. ఇరుగు పొరుగు వారితో సంఘ జీవులను సమానంగా చూసే నేర్పు గలవాడై ఉండవలె. ఆ తర్వాత మానవతా విలువలు తెలిసి ఉండాలి. నైతిక ధర్మములు, పాప పుణ్యముల వివరములు బాగా తెలిసి ఉండాలి. విగ్రహారాధన, పూజలు చేసినవాడు కావాలి. చెట్టు దేవుడని, పుట్ట దేవుడని, రాయి దేవుడని మ్రొక్కి మ్రొక్కి వేసారిపోయి, తుదకు ఏదో ఒక గురువుని చేరి, ఆ గురువు దగ్గర సాధనలు, యోగములు, ధ్యానములు, జపములు, తపములు, యమ నియమ ప్రాణ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధి, అష్టాంగ యోగములు చేసి కష్టములపాలై స్పష్టముగా తెలియలేక మరియొక గురువును చేరితే, ఆయన సర్వం ఖల్విదం బ్రహ్మ అని ఓం మిత్యేక్షర బ్రహ్మమన్నాం. ఖం బ్రహ్మమను సుగుణ బ్రహ్మమణు నిర్గుణబ్రహ్మమని సాకార బ్రహ్మమనినిరాకార బ్రహ్మమని, నిర్గుణ బ్రహ్మమని, వాచ్యబ్రహ్మమని, శబ్ద బ్రహ్మమని, ప్రజ్ఞాన బ్రహ్మమని, అహం బ్రహ్మమని, అయమాత్మ బ్రహ్మమని, తత్వమసియని - చివరకు నాయనా నీవే బ్రహ్మం నేనే, బ్రహ్మం-నీవు వేరుకాదు అంతా బ్రహ్మమయం. నీవు బ్రహ్మవైయున్నావు. ఏమాత్రం సందేహం లేదు అని ఇంటికి పంపించాడు.

ఈ శిష్యుడు నిజముగా నేను బ్రహ్మమైయున్నాను. అని సత్యముగ నమ్మి ఎంతో ఆనందంగా యున్నాడు. కొన్ని సంవత్సరముల తర్వాత ఒకానొక అచల గురుడు తన శిష్యులను కూర్చొబెట్టుకుని చక్కటి ప్రబోధ చేయుచూ, నీవు బ్రహ్మము కాదు, నీవు బ్రహ్మము కాదు. అంతా బ్రహ్మ బ్రాంతి అనుచు తత్వచరణము చెప్పుచున్నాడు. నేనే బ్రహ్మము - బ్రహ్మమె నేను 0- బ్రహ్మనైతిని అన్నవారలె మన్నుపాలైరి అని చెప్పినాడు. ఆ మాటలు ఈ శిష్యుడు విన్నాడు. మంచి సేవలు చేసినవాడు సర్వభూతముల యందు దయ, ప్రేమగలవాడు, మంచి కర్మలు చేసినటువంటి వాడు కనుక ఆ ప్రకృతి (మాయ) (ఎరుక) అతని మీద కనికరించి, శంకలేపింది. అవును - నేను బ్రహ్మమని చెప్పినాడు గదా గురువు. ఇది సరియైనది కాదు. బ్రహ్మము నామ రూప నటనలు లేనిది. కదలిక, కూడిక, వెలతి, వికారములు లేనిది. శాశ్వతమైనది అన్నప్పుడు - నామం

ఉన్నది రూపము ఉన్నది, కదలిక ఉన్నది, వికారము ఉన్నది, చావు పుట్టుకలు ఉన్నది, బ్రహ్మమునకు చావు పుట్టుకలు లేవు. అది యోగులు, ఇది మోసము ఉన్నది. ఈ గురువుకు సత్యం తెలియదు. నాకు అబద్ధము చెప్పినాడు. ఇన్ని సంవత్సరములు నా చింతన, నా పర్యటన వ్యర్థమైపోయింది. అయ్యో... నేనేమి చేయదు... నాకు నిజ గరువు ఎక్కడ దొరుకుతాడు? వయస్సు 60 సంవత్సరాలు వచ్చింది. ఇంతవరకు తెలుసుకున్నదంతా వొట్టిదైపోయింది గదా, ఆ దైవమా... అని వెక్కి వెక్కి యేడ్చుచు, నిజ గురు అన్వేషంను ప్రారంభించాడు. అలా బాధపడుతూ తిరగగా, తిరగగా హైదరాబాద్ పెద్దమహారాజ్‌గంజ్‌లో శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువుల వారు దర్శమైనారు. అతని చూడగానే ఈ భక్తునికి ఒక గొప్పదైన ఆనందం కలిగి, ఆయన పాదముల మీద వ్రాలి స్వామి గురుదేవా - పరాత్పరా పరంధామ దీనుల పాలిట దివ్యమూర్తి, కరుణాసాగర, త్యాగ నితులు మీరు. నా బాధలు పోగొట్టగలరని మీ శరణుజొచ్చినాను అనుచు తన బాధ చెప్పుకున్నాడు.

కందార్థము:

సాధన సంపత్తుయు గల సాధకుడొక నరుడు ఘోర సంసారమునన్ బాధపడ లేక తన పూర్ణోదయమున గురుని గాంచి ఉరుతర భక్తిన్ - శరణని మ్రొక్కి మరి మరి యుక్తిన్ బోధ చేయుము పుణ్య పురుషమా బోంట్లకు సాధించదగు ముఖ్య సాధనాని పలికె - యురుతర భక్తిన్ / శరణని మ్రొక్కి మరి మరి యుక్తిన్ / సాధన లేకుండ చెప్పమన లేదు. ముఖ్యమైన సాధన చెప్పి నిజ బోధ తెలుపు మన్నాడు. గమనించాలి.

ఎన్నో దేవతా పూజలు, ఎన్నో జపములును మరియు తపములు, ఎన్నో యోగాభ్యాసములు, ఎన్నెన్నో జేసి మోక్ష మెరుగనైతి. మనసును నేను నరుకలేనైతి బరువడి శా ములు పఠియించితి కాని, మాయ గురువుల జేరి గుణము కుదరకపాయె - మోక్ష మెరుగనైతి - మనసును నేను నెరుకలేనైతి. అని ఏడ్చుచూ నిలబడ్డాడు. అతని బాధను అర్థం చేసుకున్నాడు. అతనికి ఏ విధంగా బోధించవలె ఈ పూర్ణ బోధఅని తనలో తాను తను గురువు చెప్పిన పద్ధతిని గుర్తు చేసుకున్నాడు.

## సాంప్రదాయములో చేరిన వారి సంస్కారం

కం. తనకు శరణన్న వారలమనసెట్టిదో తరచి చూచి మరి తెలుపదగును అనియు

కం. చూచి మది దెలసి శిష్యుని ఆశయమున తగిన బోధనతనికి తెలియన్‌జేసితి. దేశికుడె ముఖ్యుడనుచు తెలుసుకోవోయి. కనియత గాని కలుసుకో వోయి / అనియు చెప్పదగును. గురుడు బోధను చెప్పిన పని చేసేనేని శిష్యా గ్రణుకిన్. చెప్పదగదు చెప్పిన పని తప్పని వాదించే నేని దయతలచి బోధ ఇద్దరికుండదగు నిట్టమేదా చెప్పి ముందుగ బోధ చెప్పండి. పనులన్నీ చెప్పకూడదు. వాని తిప్పల బెట్టుక

అన్నారు. శ్రీ శివరామదీక్షితులు కూడా శిష్యుడు తొందరపడ్డ గురువు తొందరపడరాదు అన్నారు. అదిగాక - ఒక్కటైనా భ్రాంతి లేక కేవలము జన్మ రాహిత్యము కావాలి, నేను లేకుండా కావాలి అను కోరిక ఉన్నవారికే చెప్పాలి అంటాడు. అందులో శ్రీ వెలివర్తి రామదాసులవారు అంటారు. వచ్చిన శిష్యుని చూచి ఏ విధంగా ఆలోచించవలెనో చెబుతాడు. సీసార్థ దర్వు = తనలోనయిట్లనె తత్వవేత్తలు ముందు శరణన్న వారిని కరుణతోడ/ మది వాని దెరిగియు మరిదెలుపరచును, మనసులో యోచించి మరి గురుండు / శాంతి, సజ్జన, సౌమిత్రి, చదువరి, సుజ్ఞాని, భ్రాంతి రహితున కెరుక బడును / పరము. ఇన్ని విధాల ఇంకా ఎన్నో విధముల పరీక్షలు పెట్టి, ఉపదేశములు చేసినారు. ఉపదేశ సమయంలో అతనిని పూర్తిగా పరీక్షించుటకు పది మంది పెద్దలు గురువు ఉండాలి. వారల సమక్షంలో అతడు, తనువు, మనసు, ధనము, ప్రాణము, సర్వము గురుదేవుని పాదముల చెంత యుంచి, ప్రమాణము చెపుతాడు. ఆ తర్వాత గురుశిష్యుల మధ్య చక్కని క్రమబద్ధమైన బోధాగ్ని వెలుగుతుంది. వీరలిద్దరి వలన ఎంతోమంది తరిస్తారు. శిష్యుడు నిరంరతము నిద్రలోకూడ నాది ఏమియు లేదు, అంతా గురు దేవునిదే అని భయభక్తుల చేత ఇల్లు, భార్య, పిల్లలు, సంపద, భూములు, బంగారం, అన్ని గురువుదేనివిఅని వాటికి కాపలదారుగా నిత్యము పనిచేసి పది రూపాయలు సంపాదించి, పొదుపు చేస్తూ గురు కార్యములు చేయుచు గురు భజనలు, గురు బోధ విచారణ, గురుభక్తుల ఆదరణ, నిత్యము అన్నదానము, వ దానము, ధన దానములు గురువాజ్ఞ మేరుక ఖర్చు చేయుచు జీవించాలి. భార్య బిడ్డల గృహ సంబంధములు లోటు లేకుండా పని పాటలు లేకుండా సోమరితనం కలుగకుండ, తిండి, నిద్ర లేక నేను నా గురువుకు సేవకుని, ఒక బంట్రోతును నేను చాలా పనులు చెయ్యాలి అనుచు అహర్నిశలు సత్యమే మాట్లాడుచూ, అసత్యపు మాటలుకాని, అసత్యపు పనులుకాని, అసత్యముతో కూడిన సంపాదన కాని చేయక, గురుని స్మరించుచు, నిత్యము వేకువ జామున 4.30 గంటలకు మేల్కొని కాలకృత్యములు తీర్చుకుని, స్నానమాచరించి, మొదట తల్లిదండ్రుల పాదములకు నమస్కరించి, స్త్రీలు లేవగానే తన భర్త పాదముల నంటి నమస్కరించి, గురుదేవుని ఛాయాచిత్రము ముందు ఉంచకుని సద్గురు స్వరూప నిర్ణయ శ్లోకములు, పరంపర ధ్యానము, లఘుపూజ శ్రీ గురుమాలా మంత్ర పఠన, అంగన్యాస, కరన్యసములతో ద్వాదశ షోఢశిమహామంత్రములు, అదకరన్యాస, అదహృదయాది న్యాసములతోచక్కగా చేసుకుని, వీలునుబట్టి, సమయమును బట్టి గంటో, అరగంటో జపము చేసుకుని, హారతులిచ్చి, తీర్థములు పుచ్చుకుని, యేపనికి వెళ్లినా ఆ పనులన్నీ జయప్రదమవుతా1యి. మనకూ శ్రేయోదాయకము, క్షేమదాయకము, మంగళప్రదము, చక్కటి జీవనము చేయుచూ సద్గురు సన్నిధానములో ఐక్యమౌతాము.

నాయనలారా, గురుబంధు సోదరులారా ఈ నిజ బోధ తెలుసుకున్నటువంటి శిష్యుడు, భక్తుడు యెక్కడ కూర్చున్నా, ఏ ప్రయాణము చేసినా, ఎవరితో కలిసినా అతనిని చూడగానే ఎదుటివారికి పరమ శాంతి

కలుగుతుంది. ఆయనతో మాట్లాడాలి అన్న తహతహలాడుచు దగ్గరికి వస్తుంటారు. ఆ ముఖవర్చస్సు చూడగానెవారలకు అనగా జనులకు, మా బంధువే, మా నాన్న, మా అన్నగారె అనే భావన వారల హృదయంలో కలుగుతుంది. కాబట్టి భక్తుడు ఉండవలసిన పద్ధతులు, గురుగీతలో - సాక్షాత్ పరమేశ్వరుడు, పార్వతి దేవితో చెప్పినాడు. గురుస్వరూప స్థితి గురు తత్త్వము అర్థమయినటువంటివాడు, విప్రదేశమునకు పోయిన ఆ ప్రదేశము ఆనందంగా సుఖ సంతోషాలతో ఉంటుంది ఇలా ఎన్నో చెప్పగలను. అయ్యా కృష్ణ ప్రభువుల వారు - కందార్థము, ఇంగితము నెరిగి సద్గురు పుంగవుచే నరుడు భుక్తి, ముక్తిక్రియలనే/ సంగాసంగములెడలిన శృంగారమె వాని చేష్ఠచూచె వారలకు / వాడున్నట్లుతోచె వారకు / మంగళ సూత్రమే భంగి శృంగారమే శృంగారవతికా యూ శృంగార వితకట్లు చూచెవారలకు / అన్నారు. ఆర్యులారా - ప్రస్తుతము మనము చూచుచున్నటువంటి శ్రీ విజయానంద వీరంత బ్రహ్మచార్యులు, వారి ధర్మపత్ని, కుమారులు, కోడండ్లు, కూతురు ఇంటిల్లి పాది నిత్యము ఆ ఇల్లు స్వర్గం వలె, ఓ సద్గురు మందిరము వలె యతుల మఠము వలె అనుష్ఠానము విచారణ నిత్యము ఆచరణ గురు నామ భజనలు చేస్తూ మంచి జీవనము గడుపుచున్నారు. ఎన్నో ఆశ్రమములకు భూరి విరాళములు, తన గురుదేవుల గురుపూజ ప్రతి సంవతత్సరం ఎంతో ఘనంగా చేయుచున్నారు. వీటి అన్నింటికంటే ప్రతి సంవత్సరం తెలుగు నూతన సంవత్సరము రోజున అచల బోధ అంతర్గామి అను నామముతో ఆంధ్ర రాష్ట్రము, కర్నాటక, మహారాష్ట్ర, గుజరాత్, ఒరిస్సా రాష్ట్రములలో జరిగే ప్రతి నెల పూజలు, అన్ని తెలియజేస్తూక్యాలండర్, పంచాంగము మనకందరికీ అందజేస్తున్న పుణ్యమూర్తి. శ్రీ విజయానంద వీరంత బ్రహ్మచారి జీవితము జన్మము ధన్యమైనది. ఆయనకు నా నిరంతర గురుస్మరణాభివందనములు చేయుచూ, ఇంకా ఇటువంటి మంచి పనులు చాలా చేయుచూ తొందరలో అచలాశ్రమము నిర్మించాలని కోరుతూ, దేవ దేవుడైన గురుదేవుని ప్రార్థిస్తున్నాను.

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు



**శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**

శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయము
శ్రీ సాందీప అచల ఋషి పరిపూర్ణ గురు ఆశ్రమము
గ్రామం : గొల్లగూడెం (గోపాలపురం), కమ్మేట పోస్ట్,
చేవెళ్ల మండలం, రంగారెడ్డి జిల్లా - 501 503. ఆం.ప్ర.

శ్రీ సత్య సత్య శాశ్వతాతీతాచల బాహ్య బ్రహ్మణే నమః





# అచల బోధాచార్య శ్రీ భీంపల్లి గడ్డెయార్యుల వారి జీవిత ప్రబోధ

అంతఃకరణ స్ఫూర్తి తో ఆలోచిస్తారా!
అంతా చెప్పేది వింటారా!
అంతటి అచల సిద్ధాంతంను వ్యాపింపచేసిన వారు
అచల బోధాచార్యులు
జన్మత వృత్తి పెరిగింది
విద్యాభ్యాసం చేసింది
విశాఖలో
కృష్ణ ప్రభువుల శిష్యసారథులు
సాధారాం బహుదూరులు
దేశాటన చేసి అచల సిద్ధాంతంను ప్రచారం చేసినారు.
విశాఖలో
అత్తిలి రాజయ్యను శిష్యునిగా అనుగ్రహించినారు
ప్రకృతి వైద్యులు చిన్నయ్యార్యులు పాద సేవ కుదిరినారు
పిపీల మార్గంలో
ఎరుక సాధన సాధించారు
నిజ నిర్ధారణలో సిద్ధులైనారు
ఎరుక బావ, బావ రహితం పొందారు.
అచల సిద్ధాంతంలో
బావ బోధకులుగా ప్రసిద్ధి చెందారు.
మయన్మార్ (రంగూన్)లో అచలమే ప్రచారం
నాటికి నేటికి
అక్కడ ఇక్కడ
అచల సిద్ధాంతంలో సిద్ధ పురుషులుగా
మన్ననలను పొందారు
ఎందరో ప్రముఖులు శిష్యులైనారు

గురు స్వరూపులారా!
ఆయన ఆచరించిన సిద్ధాంతం అచలం
బోధించి ప్రచారం చేసింది అచల తత్వం
సమాజంకు కావాలి ఏకత్వం
ఇప్పుడు ఆచరిస్తుంది మూర్ఖత్వం
ప్రచారం చేసి నిర్మిస్తుంది సమాఖ్య తత్వం
భాగవతుల కందార్థ పద్యంలు భావ బోధకం
అర్థమైయేది ఉపమాన ఉపమేయంలు భావ బోధకం
చెప్పేది పిట్ట కథల తత్వం
గ్రహించేది శూన్య తత్వం
ఒకనాటికి కూలిపోయేది పేకమేడలాగ
ఆచరణ కాని ప్రయోగం
అందరిలో ప్రచారం చేసేది వ్యామోహం
అచలం ఒక్కటే మార్గం
అదే ఆలోచనతో మోసం
నమ్మించే ఆచరణ ప్రచారం
ప్రతీ ఒక్కరు అచల గురువులే!
అవగాహనం లేదు
చెప్పేదంతా విడ్డూరం
కావాలి మార్పు
రావాలి శుద్ధ చైతన్యం
చెప్పాలి అందరికీ అచల ప్రబోధ
అచల బోధాచార్యులు చెప్పేది అదే
జన్మరాహిత్యం ఒక్కటే మార్గం
చరణం చరణమే శివరామ దీక్షితీయం



ప్రజ్ఞాన వీక్షణ
**శ్రీ భి. గోపాలబాబు**
విశాఖపట్నం

# గుర్వష్టకములు

## Guru Ashtakas' (Synopsis in English)

శ్లో॥ కళత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం గృహం బాంధవాస్సర్వమేతద్ధి జాతం।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥

1. తా. [illegible]

1. The human being is cherise to leave with an extraordinary beautiful wife and having lot of worth of amount and children having accure different types of their own kith and kin of kids. Also having symbolic design of house. The wanted and unwanted of gratification of relations. With all steadfast in success of life. If fail to perform with sense of pride and without any attachment and without concentration of mind at the lotus feet of the guru. SO there is no use of having all these thing.

**It is require perfect performance of meditational mind with spiritual aspiration of devine.**

శ్లో॥ షడంగాది వేదోముఖే శాస్త్రవిద్యా కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥

2. తా. [illegible]

2. The human being is gained the knowledge of at the face of **SHADANGAS** and gained the constitutinnal knowledge of attribution knowledge of Vedas, vedic lectures, Sastras, Poems, Poets, Poetries and Fractions to manifest to write. There is no use of having sense of control of spintual compensation of meditation with control of mind and with out having peace of mind and happiness to bow the head at the lotus feet of the guru.

**Even you are a perfect scalar in language and having egoism in mind, there is no pray the guru swarupa with can concentration of mind to get guru darshan.**

శ్లో॥ విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః సదాచారవృత్తేషు మత్తో న చాన్యః।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥

3. తా. [illegible]

3. The human race is famous with pious and spiritual aspiration of divine devotion. He is having systmatic performance of habits with his and also having pious character in and out of the centers as well as in his own country, until and unless having concentration of mind and soul with spiritual devotion towards the lotus feet of the guru. There is no use to follow the same.

**To get the absolute vision of knowledge of the guru Swaroopa with consciousness of mind even having inspiration of awareness of the world.**

శ్లో॥ క్షమామండలే భూపభూపాలబృందైః సదా సేవితం యస్య పాదారవిందం।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥

4. తా. [illegible]

4. The world is pervated with and having faith in doctrine of external Devine aspiration. A king being a worldly sovereign to steadfast the survive to others and having perfect character of performance. If his performance is not concentrated towards to the lotus feet of the guru to workship whole heartedly. There is not use of having concentration of mind.

**By the grace of guru the gained knowledge of doctrine of external spiritual devine of perfect consciousness of mind can lead strong meditational mind in heart.**

శ్లో॥ నభోగేన యోగేన వావాజిరాజౌ నకాంతాముఖే నైవ విత్తేషు చిత్తం।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥

5. తా. [illegible]

5. The rightly rejoice the delight of the glorious of the sky. The ceasless sense of knowledge prevail the performance of the yoga. The numerous activity of cosmic joyous, wealth, the beautiful and attractive woman are the worldly by enjoyment of the life. All are may not fulfil the desire, provided that does not fulfill the concentration of mind to workshop to the lotus feet of the guru.

***The glorious sense of vision of the knowledge of consciousness prevail to concentrate on send*** **guru swaroopa, unless there is no faith in workship of the lotus feet of the guru.**

**శ్లో॥ యశోమేగతం దిక్షు దాన ప్రతాపాత్ జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥**

6. తా. సద్గురుని అనుగ్రహము వలన దాన ప్రతాపముల చేత తన కీర్తి అష్టదిక్కులయందును నిండి ఈ జగత్తంతయు స్వాధీనముగా నుండిన వాడుగా నుండినను సద్గురుని పాదపద్మములయందు మనస్సు లగ్నము కానిచో ఏమి [illegible] ప్రయోజనము లేదని భావము.

6. By the grace of sadguru, having dignified property. countless wealth and prevalent property which are spread in all eight directions and even having captured the worldly range of prestage. are no use of having a pinch of responsible to constrate the spiritual mind towards the lotus feet of the guru

**Having all countless property and prestage in and around the world. even gained sufficient spiritual knowledge, provided that not remembering the Mangala Swaroopa of the guru.**

**శ్లో॥ అరణ్యే నవాస్వస్యగేహే నకార్యే। నదేహే మనోవర్తతే మేత్వనర్ఘ్యే।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥**

7. తా. [illegible]

7. Even having lot of property spread all over the range of forest and having lot of wealth and keeping sound health are not worth to have provided that not keeping the paramatma Swarupa of guru in mind and not praying the lotus feet of the guru

**By studying the spiritual preachings of the guru and having gained the spiritual devine self knowledge. there is no name of benefit to perform without concentration of mind and soul towards the lotus feet of the guru.**

**శ్లో॥ అనర్ఘ్యాణిరత్నాని ముక్తాని సమ్యక్। సమాలింగితా కామినీ యామినీషు।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥**

8. తా. [illegible]

8. If the human being is having strong prosperous property with all kind of diamonds. wealth and having a desire of dream of thoughts on beautiful ladies in night are in vain. There is no use of not having a pinch of response on constration of mind and soul at the lotus feet of the guru

**By gaining the perfect desire of meditation of consciousness of mind, it is no use of benefit to constrate. The only thing is that should be strong determined mind on sadgurus dyana and keeping the guru swarupa in mind, tell the end of life.**

**శ్లో॥ గురోరష్టకం యఃపఠేత్పుణ్యదేహీ। యతిర్భూపతిర్బ్రహ్మచారీచగేహీ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం॥**

9. తా. [illegible]

9. Lastly let it be a great spiritual mind of a Sanyasi, and A king who has well ruled the country and a batchlor who is having well disciplined character of mind to forgo to maintain. The perfect performance of spiritual aspiration of mind and having pious and devotional thoughts in steadfast to lead to constrate on guru. The guru Astakas' are the best way to adopt to constrate to make practice to get perfect devotional life

**It is always constrade to bow the mind and soul at the lotus feet of the guru and always workshop the sadguru with whole heartedly in min the lead devotional life.**



Prjnana Vilakshana
**B. GOPALA BABU**
Rtd. Rly. Engineer & Officer SE Rly
President of Achala Bodhacharya Sri Bheempali
Gaddesarya Kendra Bhakta Samajam
Visakhapatnam

# దుష్ట చతుష్టయము

1. మహాభారతం ఐదవ వేదంగా ప్రసిద్ధి చెందింది. వేదంలోని ధర్మాలను కథల రూపంలో భారతం వివరించింది. వేదం రాజులాగా శాసిస్తే, పాత్రల ద్వారా వివరిస్తుంది.

2. ధర్మాచరణకు రామాయణంలో రాముడు మున్నగువారు ఆదర్శంగా ఉన్నారు. అట్లే భారతంలో ధర్మరాజు మొదలైనవారు ధర్మానికి ప్రతినిధులు.

3. ధర్మాన్ని ఆచరించాలి. అధర్మాన్ని దూరీకరించాలి. అధర్మపరులు దుష్టవృత్తిన్ని భారతాది గ్రంథాలు నిరూపించటం ఎందుకంటే వారిలాగా ప్రవర్తించకండి అని బోధించడానికే.

4. భారతంలో దుష్ట చతుష్టయం అన్న పేరుతో నలుగురు ప్రసిద్ధి పొందినారు. 1. దుర్యోధనుడు, 2. దుశ్శాసనుడు, 3. కర్ణుడు, 4. శకుడు.

5. ఈ నలుగురూ అధర్మపరులే. దుర్యోధనుడు పరమలోభి. కృష్ణుడు రాయబారానికి వస్తే ఆయన మాట వినలేదు. పాండవులకు సూదిమొన మోపినంత నేల కూడా ఇవ్వనన్నాడు. పైగా కృష్ణుని బంధింప యత్నించాడు. మాయాజూదం సమయంలో ద్రౌపదిని తీవ్రంగా అవమానించాడు. చివరికి దుర్మరణం చెందినాడు.

6. దుశ్శాసనుడు వాని సోదరుడు. ద్రౌపది వలువలు లాగి ఆ అధర్మకార్య ఫలితంగా దుర్మరణం పాలయ్యాడు.

7. ఇక కర్ణుడు పాండవులను వదలి దుర్యోధనుని పక్షం చేరి, అధర్మ కార్యాలకు పాల్పడి చివరికి అర్జునుని చేతిలో మరణించాడు. శ్రీకృష్ణుని మాట వినకుండా పాండవులతో పోరు సాగించాడు.

8. ఇక శకుని పరమ మోసగాడు. మాయాజూదానికి కారణమితడే. చివరికి యుద్ధంలో దుర్మరణం చెందాడు.

9. పై నలుగురూ దుష్టచతుష్టయం. అందరూ యుద్ధంలో మరణించినవారే. వారు చేసిన అధర్మకార్యాలే వారి చావుకు కారణమయ్యాయి.

కావున పై దుష్టచతుష్టయము లాగా ప్రవర్తించరాదని సారాంశం.

ఇట్లు

**శ్రీ ప్రజ్ఞాన విలక్షణ ఎస్. సుబ్బయార్యులు**

తిరుపతి

# అచలగురు సాంప్రదాయం.. ఈనాటిది కాదు

## మేధావుల సద్విమర్శ

నేటి మానవ సమాజంలో దైవభక్తి ఎవరికి తోచిన విధముగా తమ అవసరాలకు అనుగుణ్యంగా తీర్చిదిద్దుతున్నారేగాని అటువంటిది నిజమైన భక్తి కానేరదు. కాలంతోపాటు దైవత్వమెప్పుడూ మార్పుచెందదు. దేశ, కాల, వస్తు బేధములు లేక నామరూప గుణములు లేక యున్నదే దేవుడు. (దైవత్వము) కాని కాలముతోపాటు, దేశములతోపాటు మార్పు చెందినది దైవత్వము అనిపించుకోదు. ఈ విశ్లేషణా భావము బ్రహ్మమునకు మాత్రమే వర్తిస్తుంది.

బ్రహ్మము అనే పదము 'బృహత్' అనే పదము నుండి పుట్టినది. బృహత్ అనగా గొప్పది, పెద్దది, సాటిలేనిది అని అర్థం ఇస్తుంది. బ్రహ్మము నిత్య, స్వ నిరావరణమైనది. సృష్టి, స్థితి, లయములకు చిక్కనిది. అండ, పిండ బ్రహ్మాండమంతా నిండియుండి, దేశ, కాల, వస్తు బేధములు లేక నిర్వికార, నిరంజనమై, సుగుణ, నిర్గుణములకు అతీతమై సర్వము నిండి, నిబిడీకజతమైయున్నదే పరబ్రహ్మము. దానిటి సాటియైనది ఇంకొకటి లేదు, యుండదు.

"అన్య విద్యా పరిజ్ఞానం అవశ్యం నశ్వరమ్ భవేత్
బ్రహ్మ విద్యా పరిజ్ఞానం బ్రహ్మ ప్రాప్తికరం స్థిరం"

అనగా బ్రహ్మ విద్య తప్ప సకల విద్యలు శాశ్వత సుఖానివ్వవు. బ్రహ్మ భావమును స్వానుభవపూర్వకముగా స్థిరపరచునదే బ్రహ్మవిద్య. బ్రహ్మభావాన్ని ఎరుగజేసి జనన మరణ జాడ్యాన్ని నివారించు విద్యయే బ్రహ్మవిద్య. ఇది ఋషి సాంప్రదాయం, ఇటువంటి సాంప్రదాయం పరిశీలిస్తే.. ఆదిగురుడు శివుడుశివుడు వలన విష్ణు, విష్ణు వలన సూర్యదేవుడు, అతని వలన యాజ్ఞవల్క్య మహర్షి, జనకుడు, శుక మహర్షి, అతని వలన సాందీప మహర్షి, వీరివలన శ్రీకృష్ణ పరమాత్మ, ఉద్ధవుడు, రామానందుల వారు, కబీరు, వేమనయోగి, శ్రీధరస్వామి, శివరామదీక్షితులు - ఈ విధం వంశపారంపర్యంగా ఈ సనాతన బ్రహ్మ భావాన్ని సేవించుకొని వస్తున్న మహనీయులే. వీరిలో యోగి వేమన ఒకరు. వీరు 15వ శతాబ్దము వారు. వీరును అచల గురు సాంప్రదాయకులే. వీరు రచించిన పద్యాలు బ్రహ్మ భావమునకు ప్రతీకగా నిలిచినవి. 18వ శతాబ్దం చివరలో మన దేశమునకు వచ్చిన ఆంగ్లేయుడు సర్ సి.పి.బ్రౌన్ దొర, వేమన గారు వ్రాసిన పద్యాలు విని అందలి భావాలకు ముగ్ధులై వేమనగారు వ్రాసిన వెయ్యి పద్యాల సేకరించి అచ్చువేయిస్తూ, "ఇవి నిగూఢ వేదాంత నిధులు, ఇందలి గూడార్థాలు గ్రహించినవారు వేమనయోగి నిజమైన వేదాంతిగా అంగీకరిస్తారు" అని వ్రాసారు.

ఆ తరువాత వేమనయోగి కోసం నిశితంగా పరిశోధించిన వారు వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ప్రథమ ఉపాధ్యాక్షుడు (వైస్‌చాన్సలర్) అయిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు. వీరు అనుపమ మేధానిధి.

వీరు వేమనగారిపై పరిశోధనలుజరిపి 1930వ సంవత్సరములో ఒక పరిశోధనా వ్యాసంలో ఈ విధంగా వ్రాసారు.

వేమనగారి వేదాంతం అచలగురు సాంప్రదాయకమనే చాలా పురాతనమైన వేదమత శాఖ. బహుశ ఈ అచల సాంప్రదాయక మనేది వర్ణాశ్రమ ధర్మాలు రూపుదిద్దుకునే కాలంనుంచీ వున్నట్లు ఋజువులున్నాయి. ఇది ఋష్యాది సాంప్రదాయకము. వేదసారం, ఉపనిషత్తుల సారము ఈ శాఖకు మూలం. మిగిలిన అన్ని మతములూ వటవృక్షమునకు శాఖలువలె విస్తరించి మూలమునకు దూరమైనవి. ఆ శాఖోపశాఖలు వేద, ఉపనిషన్మతాల ఆధారముతో పుట్టినా క్రమంగా పురాణాల వైపు మొగ్గుచూపి, త్రిమూర్తులు, అవతార పురుషులు తుదకు బాబాల వరకు దిగిపోయి, వ్రతాలు, పూజలు, కర్మలు అనేవాటితో నేడు సతమతమవుతూ ఉన్నాయి.

కాని, ఈ అచలగురు శాఖ మాత్రము అచంచలముగా తాటిచెట్టులాగ నిలువునా పెరుగుతూనే ఉంది. దీనిమూలము ఎప్పటికీ నిర్గుణ పరబ్రహ్మమే. ఆదికాలం నుండి వస్తున్న ఋష్యాది సాంప్రదాయం కుల వ్యవస్థ ఏర్పడ్డంతో చీలిపోయి రకరకాలుగా మారిపోయినది. కాని అచల భావ వేదాంతులు కుల వ్యవస్థ దూరం చేసి ఆ సాంప్రదాయాన్ని నిలబెట్టుకుంటూ వస్తున్నారు. వీరు జీవనోపనాక్రమమంతా వేదాంతమయమే. వీరు విగ్రహారాధన చేయరు. అలా చేసేవారు అజ్ఞానులని వీరి భావన అంటూ వేమనయోగి ఆధ్యాత్మిక భావాన్ని మిక్కిలి శ్లాఘించారు.

ఇటువంటి మేధావిధులంతా అచలగురు సాంప్రదాయాన్ని అచలగురు భావాన్ని హారతులిచ్చినవారే. కాబట్టి ఇట్టి సాంప్రదాయ నిజమైన బ్రహ్మ భావమును భక్తులకు అందించి జన్మతంతువులను విడగొట్టి జన్మ రాహిత్యులగు చేయుచున్నది. పరమార్థ గ్రహీతులకు ఇంతకంటే కావలసినది ఏమున్నది.

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు
(తేది: 8-2-2013న శ్రీ పీల్కాన లక్షణ ప్రభువుల శత వార్షికారాధన సందర్భమున
ఏర్పాటుచేసిన వేదాంత సభలో ప్రసంగించడం జరిగినది)



సేకరణ: క్షరాక్షర విలక్షణ శ్రీ మోసా చక్రపాణి నాయన
సమర్పణ: బ్రహ్మానంద వంకా షణ్ముఖరావు
పూర్ణ గురునగర్, శ్రీకాకుళం.

# యెరుకనే భ్రాంతా లేక యెరుక వల్ల కల్గింది భ్రాంతా?

శ్లో. ఆత్మాతీతంకేవలాత్మా దేహోనాస్తికదాచన / అస్తినాస్తీతి కోవేదః నిర్ణయోనాస్తి సర్వదా.

ఒకే ఆత్మతత్త్వం ఈ బ్రహ్మాండమంతటికి మూలమైయున్నది. అట్టి తత్త్వము తెలియవలెనంటే, అహజ్ఞాన సగోచరమైయున్నది. కాని వేదశృతులు: ఏకమేవాద్వితీయం బ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, ఏకవిజ్ఞానేన సర్వం విజ్ఞానం భవతి అని చెప్పబడిన దానికంటె నధికము లేదు. ఇలా వేదద్రష్టలగు మహర్షులు ఉత్తర్వులివి. వేదమే బ్రహ్మశృతులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు మొదలగు వాటి కన్నిటికి బ్రహ్మ జ్ఞానమే మూలము. (ఇది చైతన్యమయమైయున్నది) గనుక పిండాండములో వ్యష్టి గుర్తు ఎరిగి, పరిపూర్ణమందు లేదన్నంత మాత్రాన యెరుకపోదు. గనుక సమష్టితత్త్వంబైన యెరుక అఖండంబైయున్నది. అదియే నేను గనుక దాని రాహిత్యమందే యెరుక లేకుండా పోవాలి గనుక. యెరుక స్థాన, స్వభావ, స్వరూపములు ఎరగవలసియున్నది. ఆపై తెలియుటకు ఏమీ లేదు. అనగా సర్వముతో యెరుక నిల్చిపోతవంది. లేక పరిపూర్ణత చెందుతుంది. గనుక యెరుక లక్షణమునకు అతీతమైనదే కేవలాత్మే పరిపూర్ణమనబడును.

యెరుకనగా, జ్ఞానబ్రహ్మ. పరిపూర్ణములో తోచిన ఈ యెరుక తొలుత నిర్గుణ నిరాకారం, నిరవయం గలిగి, సంకల్ప గుణముచే (సంకల్ప ప్రభు సృష్టిః) మాయను కలిగించెను. అనగా, ఒక వ ములోనే కొంత భాగము రంగువేసినట్లుగా భావించవలెను. అప్పుడు వ మంతా ఒకటే గదా! అనగా యెరుక స్వరూపం.

ఇందులో కొంత తెలుపు (జ్ఞానం), కొంత ఎరుపు (మాయ) కనుక అంతా యెరుక భ్రమమే. ఆ మాయ పంచభూతములుగా, పంచతన్మాత్రలుగా ఏర్పడినది. అట్టి తన్మాత్రలుచె యెరుక భ్రమసి, జీవ బీజములుగా ఏర్పడినది. అనేక నానాలు అయినది. ఇదియె యెరుక భ్రాంతిలో సృష్టి నిర్మాణక్రమము.

ఉదా:- బ్రహ్మ సరస్వతిని పుట్టించెను. అట్టి సరస్వతిలోని తన్మాత్ర గుణములచె భ్రమసి, వివాహమాడి, అనేక నానాలు బృహదారణ్యకోపనిషత్‌లో కూడా ఇదే. ఉదా: మనువుకు స్త్రీజన్మించెను. అట్టి స్త్రీని మోహించగా, అది నానా స్త్రీ రూపములు వహించెను. మనవు అనేక పురుష రూపములు వహించెను. అనగా, తోచిన బ్రహ్మ తన సంకల్పగుణము చేత జీవులు యెనుబది నాలుగు లక్షలు, జీవరాసులుగా మారుట ఇది అంతయు యెరుకకు కలిగిన భ్రాంతియను నను యెరుక భ్రాంతియను నను ఒక్కటియని చెప్పవలసియుంటుంది. యెరుక అనగా, నొక్కటె గనుక, యెరుక సంకల్పమే భ్రాంతి. ఈ రెండూ యెరుకలే. మరియు సీతారామాంజనేయ సంవాదములో సీత చెప్పినది - నా రాముడు జడుడు అనగా నిశ్శబ్ద బ్రహ్మ స్వరూపము. ఆయన సంకల్పము చే ఏర్పడిన నేను సర్వశక్తి సంపన్నురాలను. త్రైలోక్యమాతను. నాకే శక్తీ - నీ రాముని నుండియే లభించెను. (రాముడే కారణము) కార్యము నేను. రెండూ ఏకమేనని గ్రహించాలి. ఇది ఆవరణలో అధిష్టానం బ్రహ్మం).



కంద: పొరలకటి దుంపయనినను -

యెరుక జేసినవిశ్వ మెరుక వంటిదె - యెరుకెతా గుర్తెరిగి ఏగితె సరి - దీని భావము

యెరుకే విశ్వము - విశ్వమే యెరుక - విశ్వము + యెరుక = ఏకము గనుక విశ్వముగా తోచుచున్నది.

యెరుక + విశ్వం = తానే. ఆకాశశ్శరీర బ్రహ్మ.

సోకామయత బహుశ్యాం శ్రీ జాయేయేతి! ఏకరూప ఆవరణము తన స్వరూపమేమీ లేదు. పరిపూర్ణ పరిబాహ్య సమాధి స్తితి తప్పా. బ్రహ్మ - సంకల్పించుకుంటే - సృష్టి అయినది. సంకల్పమే లేకుంటే బ్రహ్మ లేడు. సంకల్పము లేదు. ఏమీ లేదు. గనుక యెరుకకు గలిగిన బ్రాంతియను నను లేక యెరుకే భ్రాంతియను నను ఒక్కటిగా గ్రహిం తాను లేకపోవలెను. యిదియే భ్రాంతి రహిత విధాన అచల సిద్ధాంత నిర్ణయము.

ఇట్లు, ఆత్మీయులు

**శ్రీ కంబాల గురుమూర్తి బోధానంద రాజయోగి**

**అచల విద్యా విశారద అచల ఋషి సత్య ప్రబోధన రాజయోగాశ్రమం**

గరివిడి, శ్రీరాంనగర్, విజయనగరం జిల్లా - 535 101. ఫోన్: 9618751233



# చివుకుల శ్రీరాములు శాస్త్రి గారు

## శ్రీ శివరామదీక్షితాచల గురుపీఠం

## శ్రీ చివుకుల శ్రీరాములు శాస్త్రిగారి ప్రియశిష్యులు

## శ్రీ అమలానంద వీసంశెట్టి అయోధ్యరాములుగారు.

వీరు అచల ఋషి సాంప్రదాయంలో వీరి గురువు గారైన శ్రీ చివుకుల శ్రీరాములు దేశికేంద్రుల వారితో 1957లో బ్రహ్మోపదేశం పొందినారు. క్రమేణా బోధబడసి ఆనాటి నుండి ఈనాటి వరకు శ్రీ శివరామదీక్షితాచల గురుపూజా కార్యక్రమములకు హాజరవుతూ ఆరూఢత కలిగియున్నారు. నుండి కార్యవర్గ సభ్యులుగా ఉంటూ-వీరు 1990 నుండి 1994 వరకు అనగా ఐదేళ్లపాటు సీతాఫల్ మండి సికింద్రాబాద్ శ్రీ ఫీల్ఖాణ లక్ష్మణదేశిక మందిరమునకు అధ్యక్షులుగా కొనసాగినారు. వీరి పదవీకాలంలో శ్రీ ఫీల్ఖాణ శంకరదేశికేంద్రుల శతవార్షికారాధన ఆర్య వైశ్య అభ్యుదయ సంఘం, ప్యారడైజ్, సికింద్రాబాద్‌లో అతివైభవంగా జరిపించినారు. ఆర్థిక వనరుల కొరకై ఎవరినీ ఇబ్బంది పెట్టకుండా ఏ లోటూ లేకుండా శ్రీ అమలానంద వీసంశెట్టి అయోధ్యరాములు గారు జరిపించిరి. మరియు మందిర పేరున కొన్ని లక్షల రూపాయలు సీతాఫల్‌మండిలో నున్న ప్రాడన్షియల్ బ్యాంకులో బ్యాంకు బాలన్స్ నిల్వచేసిరి. అనగా మందిర అధ్యక్ష పదవికి సమర్థత కలిగించుకున్నారు.

ఇప్పుడు ఆయనను అఖిల భారత సేవా సమాఖ్య అధ్యక్షులైన శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ స్వామి జంట నగరములైన హైదరాబాద్‌కు అధ్యక్షులుగా నియామకం చేసియుండిరి. శ్రీ అమలానంద వీసంశెట్టి అయోధ్యరాములు గారు అఖిల భారత వైశ్య కులమునకు అనేకమైన సేవలు అందిస్తూ మన్ననలను అందుకున్నారు. సహాయ కార్యక్రమములతోపాటు సాంప్రదాయక కార్యక్రమములనూ చేపట్టుచునే ఉన్నారు.



**శ్రీ అమలానంద వీసంశెట్టి అయోధ్యరాములు**
**మరియు వీరి ధర్మపత్ని శ్రీమతి ప్రియదర్శిని గార్లు**

48, 49 సిఖ్ విలేజ్, చందులాల్ బౌళి, జైన్ స్కూల్
ఎదురుగా, సికింద్రాబాద్ - 500 003.
ఫోన్: 9347025069, 040-66320520

# ఎరుక అనగా నేమి? పరిపూర్ణమనగా నేమి?

ఎరుక అనగా నేమి? పరిపూర్ణమనగా నేమి? పర్యాయపదాలతో తెలుసుకుందాము.

ఎరుక: మాయ - సచ్చిదానందం - ఆత్మ - అనాత్మ - ఈశ్వరుడు - బిందువు - జీవుడు - అహంకారము - తెలివి - జ్ఞానము - మనస్సు - బ్రహ్మ - విష్ణు - చిత్తు - సత్తు - చైతన్యం - భ్రమ - ప్రకాశం - నేను - శరీరం - పరబ్రహ్మ స్వరూపం - చిలుకా - హింస - జగత్తు - విశ్వం - ఉపాధి - మహత్తు - సాక్షి - గుర్తు - మాయలాడి - ఎరుగునది.

పరిపూర్ణము : అచలము - బట్టబయలు - గురు స్వరూపము - సంపూర్ణత్వము - సర్వాతీతము - కేవలాత్మ - కైలాసము - వైకుంఠము - అవాఙ్మాణ గోచరముగా నిర్మతాత్మ - ధృక్ దృశ్య రహితము - యోవై భూమా - విలక్షణము - నిశ్శబ్దము - నిరాలంబము - అఖండైశ్వర్యం - అభేదం - నిరాకారము - నిత్యం ఆది మధ్యాంత శూన్యం - అనంతం - అఖండం - అగోచరం - భావాతీతం - నిజం - ఉపాధి రహితం - వాచాతీతం - అస్తి - మనోతీతం - అప్రాస్యమనసానహ - నభూమ - నిండు ఉండునది - అంతట వ్యాపించి ఉన్నది - ములుగుచ్చ సందులేనిది.

ఈ సిద్ధాంతము శ్రీ మద్రామడుగు శివరామదీక్షితులది. ఆదిలోన దక్షిణామూర్తి బ్రహ్మకు ధర్మం తెలిపినారు. బ్రహ్మ వశిష్ఠ మహర్షికి ధర్మం తెలిపినారు. వశిష్ఠుడు శ్రీ రామచంద్రునకు ధర్మం తెలిపినారు. శ్రీరామచంద్రుడు ఆంజనేయునకు ధర్మం తెలిపియున్నారు. ఈ శాఖ ఆంజనేయుని వద్ద ఆగిపోయినది - ఎందుకనగా శ్రీ రామచంద్రుడు వారి గురువు గారి వద్ద సంపూర్ణ శిక్షణ పొందలేదు. ఎందుకనగా గురువుగారి వద్దకు వెళ్లలేదు. గురువుగారిని ఆహ్వానించుకోలేదు. పెద్దలు ఏమన్నారు అనగా - గురువు వెంటనన్న ఉండాలే లేదా ఇంటనన్నా ఉండాలే అని అంటారు. అది జరగలేదు కాబట్టి 14 సంవత్సరాలు అరణ్య వాసం చేశారు, సీతా వియోగము కలిగినది. అందుకని శ్రీరామచంద్రునికి మాయామానస లోలుడు అనబడినాడు.

మరొక్క శాఖ దక్షిణామూర్తి విష్ణుమూర్తికి తెలియజేసినారు - విష్ణు భగవానులు సూర్య భగవానునికి తెలియుజేసినారు. సూర్య భగవానుడు యాజ్ఞవల్కికి తెలియుజేసినారు. యాజ్ఞవల్కి జనక మహారాజుకు తెలియజేసినారు. జనక మహారాజు శుకమహర్షికి తెలియజేసినారు. శుక మహర్షి సాందీపునకు తెలియజేసినారు. సాంధీపుడు శ్రీ కృష్ణ భగవానునికి తెలియజేసినారు. శ్రీ కృష్ణ భగవానుడు వారి గురువు గారి వద్ద 12 సంవత్సరాలు సేవ చేసినారు. పూర్తి బోధను బడసినారు. అందువల్లనే ఈ శాఖ పరంపర మనవద్దకి వచ్చినది. అందుకే శ్రీ కృష్ణమూర్తికి తలమానస లోలుడని పేరు పెట్టినారు. మన పెద్దలు తదుపరి కృష్ణ భగవానుని వద్ద నుండి

అర్జునుడు, యుద్ధవుడు వారి నుండి క్రమేణా రామానంద సద్గురు - సహజానంద సద్గురు - కబీరు సద్గురు - జ్ఞానేశ్వర యోగి సద్గురు - అంబికా శివయోగి సద్గురు, శ్రీ వేమన యోగి సద్గురు - వెంకయార్య సద్గురు - తిరువేంగల సద్గురు - శ్రీధర స్వామి సద్గురు - శివరమాదీక్షిత సద్గురు - కంబాలూరి అప్పబ్రహ్మ సద్గురు - పరశురామ సీతారామ సద్గురు - భాగవత దేశిక సద్గురు - ఫీల్కాన లక్ష్మణ దేశిక ప్రభు సద్గురు - ఫీల్కాన శంకర దేశిక ప్రభు సద్గురు - శ్రీ సచ్చిదానంద పగడాల వేంకటేశ్వర అవధూత సద్గురు - శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి సద్గురు - శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల సద్గురు - వివేకానంద ఆగోలు సంగయాఖ్య సద్గురు - వీరిద్వారా ఇలా ఎందరో శిష్య జనాలు ఉండగా ప్రచారంలో ముఖ్యంగా ముగ్గురు కలరు.

1. శ్రీ బోధానంద రాపెల్లి రాంచెంద్రయ్య, 2. శ్రీ సదానంద తంగెళ్ళపల్లి శ్రీహరి సద్గురు, 3. శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు. ఈ విధముగా గురుభక్తి - గురుసేవ - గురున్ని చెడకుండా సేవచేసి నందువల్లనే గురుకృపకు పాత్రులైరి. క్రమేణా ఈ శాఖ విస్తరణ జరుగుతూనే యున్నది. ముఖ్యముగా చెప్పాలంటే- శ్రీ సచ్చిదానంద పగుడాల వేంకటేశ్వర అవధూత స్వామి వద్ద నుండి శాఖోపశాఖలుగా విస్తరణ జరిగినదనిచెప్పవచ్చు. ఆంధ్రప్రదేశ్‌ల ఎక్కడ చూసినా వారి శిష్యులే సాంప్రదాయకులంతా వారి శాఖనే అని చెప్పకతప్పదు. అందుకే గురుభక్తి - గురు సేవ - గురునిష్ట చెడకుండా - త్రికరణ శుద్ధికి దెబ్బ తగులకుండా ఆచరణ చేసుకుంటూ - గురుకృపకు పాత్రులవుతారని విన్నవించుకుంటున్నాము.





కొత్తగా ప్రారంభించబడిన పరమేశ్వర మంగళంలోని అచల గురు మందిరం



పరమేశ్వర మంగళంలో సభా కార్యక్రమము

# శ్రీ శివరామ దీక్షిత అచల గురు మందిరము పరమేశ్వర మంగళం

పుత్తూరు మండలం, చిత్తూరు జిల్లా.

శ్రీ శివరామ దీక్షిత అచల గురు మందిరము పరమేశ్వర మంగళం గ్రామంలో 01-02-2013 తేదీ శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్యకు చెందిన సద్గురువులచే ప్రారంభించబడినది.

తదుపరి 02-02-2013 తేదీ శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయులు స్వామి ఆధ్వర్యంలో వేదాంత సభ మరియు మా సద్గురు దేవులు శ్రీ అచల ఋషి దువ్వూరు రమణయ్య స్వాముల వారి నాల్గవ వార్షికారాధన సమావేశములు జరిగినవి. ఈ సమావేశములకు అచల గురు మందిర ప్రారంభోత్సవమునకు సాంప్రదాయక పెద్దలు పలు ప్రాంతాముల నుండి పాల్గొన్నారు. మరియు శ్రీ సద్గురు కటాక్ష విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు కూడా పాల్గొన్నారు.

మా సద్గురు దేవులు అచల ఋషి దువ్వూరు రమణయ్య స్వాముల వారు అశరీరులైన తర్వాత వారి శిష్యులమైన మేము వారి సుసంకల్పం మేరకు అచల సిద్ధాంత వ్యాప్తికి పాటుపడుతూ, ప్రతి సంవత్సరము కార్యక్రమాలను నిర్వహిస్తూ నూతన గురు మందిరమును గురు శిష్యులందరి సహకారంతో నిర్మించితిమి. సమాఖ్య అధ్యక్షులైన శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయులు స్వాముల వారు మరియు ఇతర సమాఖ్య పెద్దలు మా కార్యక్రమములకు ప్రోత్సాహాన్ని, ఆశ్రమ నిర్వహణకు సహకారాన్ని అందిస్తూ ఉన్నారు.



డా. జయలక్ష్మి, వర్మ

ఇట్లు,

శ్రీమతి సులక్షణాంబ, డా. జయలక్ష్మి సమేత డా. చంద్రశేకర వర్మ
శ్రీమతి సుధామృతాంబ వనజాక్షమ్మ సమేత బాబునాయుడు
శ్రీమతి మల్లీశ్వరి సమేత శ్రీ సుజ్ఞానానంద డా. అరుణ్ కుమార్
శ్రీమతి శైలజ సమేత శ్రీ సుభోదానంద కరుణ్‌కుమార్
మరియు పరమేశ్వర మంగళం గురుభక్త మండలి



శ్రీమతి వనజాక్షమ్మ



కె. అరుణ్ కుమార్

# మేలుకొలుపు

1. మేలుకొనుము పిండమందున మేలుకొను బ్రహ్మాండ మందున
మేలుకొను భవరోగమందున మేలుకొనవయ్యా || ఆత్మ ||

2. పంచభూత పంచకంబు పంచవింశతి తత్వమాయెను
పంచవింశతి తత్వమందున పరగమేలుకొనుమా || ఆత్మ ||

3. దేహమందున మేలుకొనుమి దేహి నీవని యెరుగ గనుమీ
దేహి దేహము విషయమేమిటో తెరవుగనుకొనుమి || ఆత్మ ||

4. జాగ్రత్త అనగా నేమో తెలియుము. సప్నమనగానేమో గనుమి
సుషిప్తి తుర్యము అవస్థ లేమిటో క్లుప్తముగ కనుమీ || ఆత్మ ||

5. క్షరుని యందు మేలుకొనుమి - అక్షరుడు అనగా నెవరు గనుమి
క్షరుని అక్షరుని కావల పరము గనుకొనుమీ || ఆత్మ ||

6. పిండ ఈశ్వరాండము బ్రహ్మాండములలో ఎరుక నెరిగియు
ఎరిగి బ్రహ్మాండమున కావల బయలు కనుకొనుమి || ఆత్మ ||

7. ఆత్మ నీవని ఎరుగకుంటివి అనాత్మ ఏమో తెలువదంటివి
ఆత్మ నాత్మల కావల కేవలాత్మ నెరుగ వలెను || ఆత్మ ||

8. ద్వాదశాక్షరి యేమి లేదని షోడషికి మూలంబు లేదని
ద్వాదశి షోడషుల భావము యేమీ లేదు లేదాయే || ఆత్మ ||

9. మేలుకొలుపుచూ పొన్నాల రాజయ్య భక్తులను దరిచేర్చెను
కీలు తెలిసి ఆగోలు సంగయ్య భక్త జనమును బ్రోచెను || ఆత్మ ||

10. మేలుకువ ఆగోలు సంగయ్య త్యాగధనమని కొలిచెను
మేలుకొని వీరంత బ్రహ్మము దివిటీని వెలిగించెను. || ఆత్మ ||

# మంగళ హారతి

1. హారతిదిగో మంగళారతిదిగో
శివరామ దీక్షిత అచల ఋషులకు || హారతి ||

2. దక్షిణామూర్తులకు శిష్యుడు శిక్ష నొందిన విష్ణుమూర్తికి
సూర్య భగవానునుకి మరియు శిష్యుడైన యాజ్ఞవల్క్యకి || హారతి ||

3. జనక చక్రవర్తికిపుడు శుకునకు సాందీప ఋషికి
ద్వాపరంలో కృష్ణునకు ఆ పరంపర అర్జునునకు || హారతి ||

4. యుద్ధవుండగు బుద్ధునకును సిద్ధుడు శ్రీధరుల స్వామికి
అచల భావము బయలుపరచిన దీక్షితులు శివరామునకును
|| హారతి ||

5. కంభాలూరి అప్ప మంత్రి కవులు పరుశురాములకును
భాగవతుల కృష్ణప్రభువుకు ఫీల్ఖాన లక్ష్మణులకు || హారతి ||

6. సోదరుండగు శంకరులకు యోగి వెంకటేశ్వరులకు
హారతులు హనుమంత గురువుకు మరియు పొన్నాల్ రాజయార్యకు
|| హారతి ||

7. సాంఖ్య తారక క్రమము తెలిపిన స్వామి సంగామేశునకును
సతతము నిజగురుని దలచి భ్రమలు తొలగిన బ్రహ్మమునకు
|| హారతి ||

8. అనుభవమొందిన అచల ఋషులకు - సాంఖ్య తారక
విచారులకును నిరతము నిజ గురువు నందు
నిలకడైన నిర్మలులకు || హారతి ||

## వీరు శ్రీ విబుదానంద అనంతుల మన్నె రామాయార్య రాజయోగి



**వీరు 2012లో అశరీరులైనారు.**

వీరి స్వగ్రామం మల్కాపురం, తూప్రాన్ మండలం, మెదక్ జిల్లా. వీరు 1953లో శ్రీ నిజానంద పోలోజు వీరాచారి రాజయోగి గారి వద్ద ప్రమాణ పత్రము పొందినారు. మరియు1982లో సిద్ధాంతమును బోధించుటకు బోధాధికారము పొందినారు. తద్వారా కొన్ని సాంప్రదాయక గ్రంథములను రచించారు. వాటిలో 1. అచలబోధ తత్వములు, 2. సాంఖ్య విచారణ, వస్తు నిచ్చయ పదార్థము, 3. క్షరాక్షరోపాదిద్వయ దోష రహిత పద్ధతి. వీరు రామాసాగర్ ఉపపీఠమునకు కార్యదర్శిగా వుంటూ ప్రతియేటా మాఘ శు. పౌర్ణమి నాడు వార్షికోత్సవములు మరియు వైశాఖ శు. త్రయోదశినాడు మల్కాపురంలో వీరి గురువు గారి పాదుకా పూజ కార్యక్రమములు నిర్వహించుచున్నారు. సెల్: 94403 73371



## శ్రీ అచలానంద నిట్ట నారాయణ గారు శ్రీమతి అమలాంబ నిట్ట మంగమ్మగారు

వీరు 24-2-2003లో ధర్మం తెలుసుకున్నారు
ఇ.నెం. 18-7-595/1, వివేకానంద నగర్, ఛత్రినాక,
హైదరాబాద్-53. ఫోన్: 9346644155
040-24381795, 24362605

**మహేష్ ప్లాస్టిక్ ఇండస్ట్రీ అధినేత**

**2007 ప్రకటన దాతలు**



నల్లగొండ జిల్లా చిట్యాల మండలం గుండ్రాంపల్లి గ్రామంలో భీమిడి సంగారెడ్డి, నర్సమాంబల గర్భ జనితుండను. నా వృత్తి వ్యవసాయము. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె శ్రీవారల శిష్యులు. ధర్మపత్ని సత్యమ్మ మరణంతో సంసారంపై విసుగుచెంది తిరుగుచుండ లలితాంబ రమ్మని రాజమార్గము చూపె. గురుని పథము గంటి గురుతుగంటి. శ్రీ ధాన నామ సం. శ్రావణి శు. పౌర్ణమి రోజున సద్గురువులచే ధర్మోదేశం పొందితిని. శ్రీ తారణ నామ సం. వైశాఖ పౌర్ణమి 4-5-2004న స్వామి కృపచే బోధాధికారము పొందితిని. 46 మంది సద్గురుమూర్తి శిష్య బృందంతో గుండ్రాంపల్లిలో గురుమందిరము నిర్మించి నిత్య భజనలు, పౌర్ణమి రోజున పూజలు నిర్వహిస్తున్నాము.

**- శ్రీ విబుదానంద భీమిడి బుచ్చిరెడ్డి**



## శ్రీ అ.ప.పూ. మంజోజు మానిఖ్యాచారి వీరి సతీమణి శ్రీమతి అ.ప.పూ. చండికాదేవి

వీరిరువురు మరియు నలుగురు పిల్లలు
శ్రీ సదానంద శ్రీహరి రాజయోగి వద్ద 30-3-2000నాడు బ్రహ్మోపదేశం తెలుసుకున్నారు. వీరి బంధువులందరూ ఈ సాంప్రదాయంలో ఉండుట ప్రత్యేకత.
ఎల్ఐజి-131, ఫేజ్-2, ఎ.పి.హెచ్.బి. కాలనీ,
పి.ఆర్.పల్లి క్రాస్ రోడ్స్, సంగారెడ్డి, మెదక్ జిల్లా.
ఫోన్: 9346504127



శ్రీమతి అమలమూర్తి తమంట అచ్చమాంబగారి శిష్య బృందంలో శ్రీ సదానంద సత్తూరి బాలస్వామి వారు మరియు శ్రీమతి ఆదర్శనందాంబ నారాయణమ్మ వారు ప్రియశిష్యులు కాగా శ్రీ సదానంద సత్తూరి బాలస్వామి వారు పానుగల్లులో శ్రీ శివరామ దీక్షిత అచల గురు పీఠాన్ని ది. 10-11-1990న వైశాఖ పున్నమి రోజున స్థాపించి, కార్యదర్శిగా కొనసాగుతూ వచ్చారు. 26-1-2004 రోజున వీరు బ్రహ్మైండైఖ్యం చెందినారు. అప్పటినుండి ఆ మందిరమునకు కార్యదర్శిగా శ్రీమతి నారాయణమ్మ గారు ఉంటూ, ప్రతి సంవత్సరం మాఘ బ. దశమి మరియు ఏకాదశి రోజుల్లో వార్షికోత్సవాలు నిర్వహించుచున్నారు.



వీరి చిరునామా: పానుగల్లు,
మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్:
08501-279311



శ్రీ పరిపూర్ణానంద గోపాలార్యులవారి ప్రియశిష్యులు

**శ్రీ దయానంద నేతికార్ మారుతిరావు**

**వీరి సతీమణి అ.ప.పూ. శ్రీమతి శాంతి బాయి**

**సబ్‌ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్**

18-7-594, ఛత్రినాక,
బోయిగూడ,
హైదరాబాద్-53.
ఫోన్: 040-65702202
సెల్: 9440700442

**2007 ప్రకటన దాతలు**

**శ్రీ నిర్మలానంద కాడిగె నారాయణ గారు వీరు అశరీరులైనారు.**



వీరి గురువుగారు నర్సింహదాసు పరంపర చివుకుల శ్రీరాం శాస్త్రి గారు. వీరు కొంతకాలము శ్రీ లక్ష్మణ దేశిక ప్రభు మందిరం సీలాఫల్ మండికి ప్రధాన కార్యదర్శిగా ఉండి సాంప్రదాయక బోధనం ప్రచారం చేయుటయే గాక, మందిరము అభివృద్ధికి కృషిచేసి, ఆర్థిక వనరులు సమకూర్చినారు. శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్యకు సలహా కమిటీలో సభ్యులుగా ఉండేవారు. ప్రతియేటా వైశాఖ శు. సప్తమి రోజున గుండా ఈశ్వరయ్య - చెన్న అంతయ్య గారి వార్షికారాధన మహోత్సవములు, వైశాఖ బ. త్రయోదశి రోజున శ్రీ చివుకుల శ్రీ రామశాస్త్రి గారి వార్షికారాధన, కార్తీక శు. అష్టమి రోజున శ్రీ కాడిగె లక్ష్మమ్మ గారి వార్షికారాధనలు జరిపించుచుండేవారు. కొన్ని సాంప్రదాయక గ్రంథములను ముద్రించియున్నారు.

**వీరి చిరునామా: శ్రీ కాడిగె నారాయణ, 13-4-757/1బి,**
**మర్కండేయ భవన్ ఎదురుగా, కార్వాన్, హైదరాబాద్-067.**
**ఫోన్: 040-24822582**



**శ్రీ సదానంద జక్లేరు డి. వెంకట్ రాములు**

**వీరి సతీమణి శ్రీమతి అ.ప.పూ. జక్లేరు సత్తెమ్మ**

జక్లేరు వెంకట్ రాములు గారు తేది 25-11-2011 శుక్రవారం రోజున పగలు 3.03 గంటలకు బ్రహ్మైండైక్యము చెందినారు. తదుపరి బాధ్యతలను వీరి కుమారుడైన నరేష్ స్వీకరించారు.

ప్రతి సంవత్సరము వైశాఖ శు సప్తమి రోజున వార్షికోత్సవము జరుగును.

**6-5-75/3, బాబుల్‌రెడ్డినగర్, కాటేదాన్, హైదరాబాద్-077**
**ఫోన్: 040-24369691 - 9440075820**

ప్రస్తుతం గురు కార్యక్రమాలన్నీ వారి కుమారుడు జక్లేరు డి.నరేష్ గారు నిర్వహించుచున్నారు.



## శ్రీ గోశిక అంజయ్య

పరవమాత్మ నిర్ణయానుసారంగా అణువు మొదలుకొని మహా మేరు పర్వతము గల సకల జీవోపాదుల యందు సకల వస్తువుల యందు మాహ్యాభంతరము అనే నిర్ణయం లేక అవస్తత్రయులు పొందింపజేస్తూ బాల్య, యౌవన, కౌమారవముల సంకల్ప వికల్పములు, సంయోగ వినియోగములు, ఎనుబది నాలుగు లక్షల జీవోపాదుల సృష్టించి, పోషించి లయము చేస్తూ విస్తీర్ణ ఆకర్షణముల పొందిస్తూ అఖండ మేరుకు తలభారవము జరిగినప్పుడు ప్రళయువము జరిగిస్తూ బాధ్యతా రహితంగా వ్యవహరిస్తూ పంచమహా భూతములకు కారణంగా వుండి, తాను కదలకనే కదులుతూ స్థావర జంగమ రూపములో వ్యవహరిస్తున్నవి. రాకడ పోకడ లేక శేషించి సత్య స్వరూపమై సాకార నిరాకారముగాక పాప పుణ్యంబులు బంధ మోక్షము గాక శాశ్వమై యున్నది. కాబట్టి కారణ బ్రహ్మమే.అవాంఘ్ మాన ఘోచరమై నామ రూప అకియా రహితంగా యున్నది. దానిని గురు కరుణ చేత అమూలాగ్రము గ్రహించి స్థాన స్వరూప స్వభావము గుర్తెరిగి దాని కతీతమై రెండవది అనే నిర్ణయువము లేక ఉన్నదే నిజబయులు. అదే పరిపూర్ణ పరబ్రహ్మము. ప్రస్తుతం వీరు దిల్‌షుక్‌నగర్‌లో నివసిస్తున్నారు.

వెల్లంకి పోస్ట్, రామన్నపేట మండలం, నల్గొండ జిల్లా -508 113.
ఫోన్:08694-255344, సెల్: 9885782560, 9848312841

## శ్రీ పూర్ణానంద గాదాసు ఆగయ్య రాజయోగి
## వీరి సతీమణి అ.ప.పూ. శ్రీమతి కనుకమ్మ



వీరు శ్రీ విద్యానంద మానసగళ్ వెంకన్నగౌడ్ గారి ప్రియశిష్యులు. వీరు సుల్తానాబాద్ గ్రామంలో శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంత అచల పరిపూర్ణ రాజయోగ ధ్యాన మందిరము స్థాపించిరి. వార్షిక ఆరాధన ప్రతి సంవత్సరం కార్తీక శు. పంచమి రోజున నిర్వహించెదరు. వీరు నిజ సాంప్రదాయము ఉన్నది ఉన్నట్లు ప్రచారం చేయుటకు పూనుకున్నారు.

వీరి చిరునామా: దయానంద కంగన్ హాల్,
కాలేజీ గేట్ ఎదురుగా, సుల్తానాబాద్,
కరీంనగర్ జిల్లా . ఆం.ప్ర. సెల్: 9949551270

## 2007 ప్రకటన దాతలు





## శ్రీమతి భారతాంబ సమేత
## శ్రీ సచ్చిదానంద మద్దుల వెంకటరెడ్యార్యులు

వీరు కొన్ని సంవత్సరములు శ్రమపడి ఆశ్రమమునకు స్థలము ఒకరి వద్ద, ఆర్థిక విరాళములు మరికొందరి వద్ద సమకూర్చి శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర ఆశ్రమము అను నామముతో రూపకల్పన చేసి నిర్మాణము చేసియున్నారు. ఈ ఆశ్రమమునకు మాఘ శు. ఏకాదశి రోజున ప్రారంభోత్సవము చేసియున్నారు. ప్రతి సంవత్సరం మాఘ శు.తదియ రోజున వార్షికోత్సవము జరిపించెదరు.

గ్రా. పొలుమళ్ల, నూతనకల్ మండలం, నల్లగొండ జిల్లా.
ఫోన్: 08693-200014 (ఆశ్రమం), 08719-249241 (నిలయం)





## సౌభాగ్య గంగా సమేత
## డాక్టర్ నిర్మలానంద దూస లక్ష్మణార్యులు

నిర్మలానంద శ్రీ దూస నరసింహార్యుల వారి ఆజ్ఞానుసారం డాక్టర్ నిర్మలానంద దూస లక్ష్మణార్యులు ప్రతి సంవత్సరం కార్తీక శు. పున్నమినాడు శ్రీవారి పాదుకా పూజ మహోత్సవము జరిపించెదరు. అలాగే శ్రీ నాగయార్యులవారి పాదుకాపూజా మహోత్సవముతోపాటు శ్రీమతి వీరమాంబ సమేత శ్రీ నిర్మలానంద దూస నరసింహార్యుల వారి పాదుకా పూజ జరిపించెదరు.

**వీరి చిరునామా: శ్రీ నాగయార్య అచల గురు గీతామందిరము**
**ఇందిరానగర్, తాండూరు, రంగారెడ్డి జిల్లా.**




**శ్రీమతి అ.ప.పూ. సుగుణమ్మ గారి సమేత**
**విమర్శనానంద శ్రీ అనంతోజు పెంటాచార్యులు**

**వీరు దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి శిష్యులు**

మార్గశిర శు. 12-12-1970 రోజున సాంప్రదాయ శివరామదీక్షితాచల జెండా ప్రతిష్ఠ చేసి గురుకృపా మందిరంగా తీర్చిదిద్దినారు. అదే ప్రకారం ప్రతి సంవత్సరం నియమిత రోజున జయంతి జరుపబడును.

ఫోన్: 08457-246308, 9949384776




అమలానంద శ్రీ పాటల పండరినాథ్ గారి ప్రియశిష్యులు

**శ్రీ అ.ప.పూ. సిరిమల్ల బుచ్చిమల్లయ్య గారు**
**వీరి సతీమణి శ్రీమతి అ.ప.పూ. పుష్పగారు**

ప్రగతి కాలనీ, మైలార్‌దేవులపల్లి, రాజేంద్రనగర్, రంగారెడ్డి జిల్లా.

## 2007 ప్రకటన దాతలు

శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియశిష్యులు

**శ్రీ నిజానంద పోలోజు వీరాచారి రాజయోగి**



వీరు సానగ గోత్ర పోలోజు వంశీకులైన లక్ష్మణాచారి, రామానుజాంబ పుణ్య దంపతుల కుమారుడు. పన్నెండవ యేటనే వీరికి లక్ష్మీ నర్సమాంబ గారితో వివాహము జరిగినది. వీరి తల్లి రామానుజాంబగారు పండరీపురం వెళ్లారు. వెంటనే వీరు కూడా పండరీపురం వెళ్లి తల్లి గారిని దర్శించి తిరు మంత్రోపదేశం పొంది స్వగృహానికి తిరిగివచ్చారు. తర్వాత అద్వైత సిద్ధాంత గురువులచే ఉపదేశమును పొంది తత్త్వములు, పద్యములు వ్రాశారు. వందలాదిమంది శిష్యులను తయారు చేసినారు. మార్గశిర శు. పౌర్ణమి నాడు శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దగ్గర ఉపదేశము పొంది కృతార్థులయ్యారు. వీరి రచనలు: 1. పరతత్త్వ బోధకందార్థములు, 2. కరుణ, 3. మోక్ష హరిశ్చంద్ర, 4. శ్రీకృష్ణబోధామృతం, 5. పరిపూర్ణ బోధసిద్ధాంత బుర్రకథ, 6. వేమన జీవిత చరిత్ర, 7. అనుష్ఠాన విధానము, 8. తత్త్వ ప్రకాశిక. నిజామాబాద్ జిల్లాలో ప్రబోధపల్లడి చేసి మత గురువులను జయించారు. ప్రబోధ ప్రచారం చేయడానికి స్వాతంత్ర్యము కల్పించిన మహనీయుడు ఈయన.




**శ్రీ సమరసానంద చిటుగోరి లక్ష్మణ్ రావు**
**వీరి సతీమణి శ్రీమతి అ.ప.పూ. భారతమ్మ**

వీరు సాంద్రాయంపై ఎంతో ఆసక్తితో 1976లో శ్రీ పరిపూర్ణానంద చదుపల్లి గోపాలార్యుల వద్ద బ్రహ్మోపదేశం పొందినారు. తదుపరి సీతాఫల్‌మండి సికింద్రాబాద్‌లో నున్న లక్ష్మణదేశిక ప్రభువుల మందిరము, నిర్మాణ కమిటీకి చైర్మన్‌గా వుండి, ఆ భవన నిర్మాణమునకు తమవంతు ఆర్థిక సహాయం అందజేసి ఇతరులను ప్రోత్సహించిరి. సాంప్రదాయబద్ధులై ఆశ్రమ నియమాలకు కట్టుబడివుంటూ బోధ ప్రచారమునకు చేయూతనిచ్చుచున్నారు. వీరి జన్మదినము 12-6-1958.

వీరి చిరునామా: 201, ప్రశాంతి భవన్, బాగంబీర్, కూకట్‌పల్లి, హైదరాబాద్. ఫోన్: 040-23064307, 9393338418.





ముంబాయిలో 28-1-2013న శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ స్వామితో
శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు. చిత్రంలో శ్రీ నిర్మలానంద వనమాల లింగం,
శ్రీ బోధానంద బొడ్డు అంబరీష ఉన్నారు.




2012లో పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం వద్ద గల అంతర్వేది సముద్ర తీరమున
సాంప్రదాయక సహోదరులతో శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు

## మా వద్ద లభించు గ్రంథములు

- ★ సాంఖ్యయోగ ప్రయోగము
- ★ అచల ఋషిరాజయోగి క్యాలండరులు
- ★ పరిపూర్ణ యదార్థ బోధ
- ★ విశ్వకర్మ ధర్మకర్మలు
- ★ అచల బోధ అంతర్గామి
- ★ సాంప్రదాయ పరంపర గురువుల ఫోటోలు

మరియు పీఠ గ్రంథములు అందజేయబడును.

# విచారణ
# ఆచరణ
# ప్రచారము

విచారణతో వస్తువు గ్రహించుము.
ఆచరణతో అనుభూతిని పొందుము.
ప్రచారముతో జనులను ప్రభావితము చేయుము.

మా చిరునామా:
శ్రీ సద్గురు కటాక్ష విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు
1-4-27/71/29, పద్మశాలికాలని, హైదరాబాద్-500 080
9849560048, 040-27537839 - 9849107122